# భారతదేశంలోని
# విదేశ పెట్టుబడులు



రచన: ప్రేమ్ సాగర్ గుప్త.

అనువాదం: డి. వి. సుబ్బారావు



విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

# ఉపోద్ఘాతం

"ఏ దేశమైనా ఆ దేశంలోని పెట్టుబడుల పెత్తనంలోనే వుంటుంది. ఏఏ మోతాదుల్లో విదేశీ పెట్టుబడి దేశంలోకి వస్తుందో ఆమేరకు విదేశీ ప్రభావం, పెత్తనం దేశంలో పాదుకొంటాయి. అందువల్ల పెట్టుబడి క్రమమంటే, దేశాన్ని స్వాధీనం చేసుకునే క్రమమే" నని అమెరికా అధ్యక్షుడు విల్సన్ ఒకప్పుడు అన్నారు.

ప్రెసిడెంట్ విల్సన్ చెప్పిన యీ మాటలు యథార్థమని ప్రపంచం మొత్తంయొక్క అనుభవమే చాటుతున్నది. అన్ని వలస, అర్ధవలస, అధీన దేశాల అనుభవమిదేనని అందరూ అంగీకరించినదే. ఒక దేశపు ఆర్థిక విధానము విదేశీ పట్టునుండి ఎంతమేరకు స్వతంత్రంగా వుంటుందో అంత స్వతంత్రంగానూ ఆ దేశం వుంటుందని ఎల్లరూ ఒప్పుకొన్నదే. దేశపు ఆర్థిక విధానంపై పట్టుతో సామ్రాజ్యవాదం, దేశాలను పాలిస్తుంది. ఆ దేశపు స్వేచ్ఛాయుతాభివృద్ధిని నిరోధించేవిధంగా యీ పెత్తనం సాగుతుంది.

మన దేశం యిప్పుడు స్వతంత్ర దేశమనీ, భారతీయార్థిక విధానంపైగల సామ్రాజ్యవాద పెట్టుబడుల పిడికిలి వదలిపోయిందనీ, కనీసం, తగినంతగా బలహీనపడిందనీ, స్వేచ్ఛాయుతాభివృద్ధి పథాన పురోగమించడానికవసరమైనంత బలంగా భారత బూర్జువావర్గమున్నదనీ; — కాంగ్రెస్ నాయకులు భారత బడా

వ్యాపారుల్లో ఒకానొకభాగమూ, తదితరులూ, అహర్నిశలూ వాదిస్తున్నారు.

భారతదేశంలోని విదేశీపెట్టుబడుల స్థానాన్ని పరిశీలించడం; దానియొక్క విస్తృతిని పరీక్షించడం; బూర్జువావర్గమూ, మన ఆర్థిక విధానమూ స్వతంత్రంగా వున్నవనడం వాస్తవమేనా? మనం నిజంగా స్వతంత్రులమేనా? అనే విషయాలను తరచడమే యీ పుస్తకపు లక్ష్యం.

—రచయిత.

# గమనిక

రచయిత యీ పుస్తకంలో చేసిన కొన్ని సూత్రీకరణలను నిరూపించుటకు వుపకరించుననుదృష్టితో, కొన్ని టేబుల్సు వేరే పుస్తకంలోనుండి తెచ్చి చేర్చాను. అట్లే, రజనీపామీదత్తుగారు వ్రాసిన 'నేటి భారతదేశం'లోనుండి కూడా కొంత సమాచారాన్ని కలిపాను. విదేశీపెట్టుబడులు చేసిన దోపిడీని, మన ఆర్థికవిధానంపై వాటికున్న పట్టును స్పష్టంచేయుటకు వుపయోగించుననే భావంతోనే వీటిని చేర్చడమైనది.

—అనువాదకుడు.

# విదేశ పెట్టుబడుల విస్తృతి:
# దాని ప్రభావం

బ్రిటిష్ తూర్పు ఇండియా కంపెనీ వర్తకులు మొదటగా మనదేశం వచ్చినపుడు, గాజుపూసలు అమ్మకానికి యివ్వాలనుకున్నారు. భారతదేశపు ఫ్యూడల్ ఆర్థికవిధానంలో చేతివృత్తి వుత్పత్తి వున్నతస్థాయిలో నున్నదని వారికి తెలియదు. ఇది విన్నపుడు మొగల్ దర్బార్‌లో అందరూ పొట్ట చెక్కలయ్యేలా నవ్వడంతో ఇంగ్లీషు వ్యాపారులు అణకువ నేర్చుకున్నారు. భారతీయ వస్తువులను కొని, ఇంగ్లండు, ఐరోపాలకు ఎగుమతి చేయడానికిగాను కలకత్తా, సూరత్‌లలో కొన్ని గోదాములతో సంతృప్తిపడ్డారు.

ప్లాసీ యుద్ధానికి పూర్వమూ, (1757) తర్వాతకూడా భారత సంస్థానాధీశులను, రైతులను, వర్తకులను, చేతివృత్తులవారిని దోచుకోవడంలో, ఫ్యూడలిజంలో స్వభావసిద్ధంగానే వుండే అనైక్యత వారికి తోడ్పడింది. మన కనకపురాసులు, సిరి సంపదలూ కొల్లగొట్టి ఇంగ్లండుకు ఎగుమతిచేశారు. బ్రిటన్‌లో పరిశ్రమలు నిర్మించడానికి యివి పెట్టుబడిగా వుపకరించాయి.

"........ఆసియాఖండంలో బ్రిటన్ సంపాదించిన స్థానంనుండి జనించిన ప్రతిష్ఠ, సంపదలే బ్రిటిష్ సామ్రాజ్యమునకు పునాదులు". (లార్డ్ కర్జన్ వ్రాసిన "దూరప్రాచ్యపు సమస్యలు". (1894) 419 పేజీ).

(1)

మన దేశాన్ని సైన్యంతో జయించిన తర్వాత చేతివృత్తి వుత్పత్తి విధానం బలవంతంగా అణచివేయబడింది. ఇంగ్లండులోని పరిశ్రమల్లో తయారైన వస్తువులు మన దేశంలోనికి రా నారంభించాయి.

మునుపటివలె మన దేశ వస్తువులను ఎగుమతిచేసేది పోయి, మన దేశంపై బ్రిటిష్ సరుకులను రుద్దడం సాగింది.

"1814-35 సంవత్సరాలమధ్య, బ్రిటన్‌నుండి భారత దేశానికి ఎగుమతియైన ప్రత్తివస్తువులు 10 లక్షల గజాలనుండి, 5 కోట్ల 10 లక్షల గజాలకు పెరిగింది. అదేకాలమునందు, భారతీయ ప్రత్తివస్త్రాలతానుల ఎగుమతులు, 12,50,000 గజాలనుండి 3 లక్షలకు పడిపోయింది. క్రమంగా, 1844 వచ్చేసరికి భారతీయ ఎగుమతులు 60,000 గజాలు మాత్రమే వుంది". (రజనీ పామీదత్తు, నేటి భారతదేశం)

"1818-36 సంవత్సరములమధ్య, ఇంగ్లండు భారతదేశానికి చేసిన నూలు ఎగుమతి 5200 రెట్లు పెరిగింది". (అదే పుస్తకంలో).

19 వ శతాబ్దంలో, పెట్టుబడిని ఎగుమతిచేసే విధానం (ఫైనాన్సు కాపిటల్) సర్వశక్తి సంపన్నంగానున్న రోజుల్లో, మన దేశంలోకి పెట్టుబడిని దిగుమతి చేయనారంభించింది. ఆవిధంగా, మనం యీరోజు బ్రిటిష్ పెట్టుబడులని పిలిచేవి తలెత్తాయి. ఇది నిజంగా బ్రిటిష్ పెట్టుబడియేనా? లేక మన దేశంలో కొల్లగొట్టి ఎగుమతి చేయబడిన సంపదలే తిరిగి ఈ రూపంలో వచ్చాయా? అనే సంశయం రావచ్చు. మనల నుండి దోచుకొనిపోబడినదే మరో పేరుతో తిరిగివచ్చింది. ఏది

ఏమైనా ప్రస్తుతం యీ వివాదం మనకు ఏమీ ఉపయోగ పడదు. అలా వచ్చినదానిలో ఎంత వారు వదలి వెళ్ళారు? దాన్ని మనం ఏమి చేయాలి? అని ఆలోచిద్దాం.

భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడులను గురించి, 1896 నుండి అనేకదశల్లో, చాలామంది వ్యక్తులు, ఆర్థికవేత్తలూ, బ్రిటిష్‌గుత్తాధికార్లు వివిధ అంచనాలు యిస్తూవచ్చారు. మన దేశంలోని బ్రిటిష్ పెట్టుబడి దాదాపు 100 కోట్ల పౌన్లు. అంటే షుమారు 1300 కోట్ల రూపాయిలుంటుందని సర్వ సాధారణంగా అంటుంటారు.

ఈ అంచనా 1931 లో 'అసోసియేటెడ్ ఛేంబర్ ఆఫ్ కామర్సు ఆఫ్ ఇండియా, సిలోన్' యిచ్చినది. తర్వాత దీనినే, జి. డి. బిర్లా అంగీకరించాడు. కాని యింతవరకు నిర్దిష్టమగు శాస్త్రీయ పరిశోధన జరగలేదు. ఇంతవరకు జరిగినదంతా వూహా మాత్రమే. అయితే వీటిలో ఎంతభాగం ప్రభుత్వ రుణాల రూపంలో వున్నది? ఎంతభాగం వ్యక్తిగత వ్యాపార పెట్టుబడులలోవున్నది అన్న విషయంపై స్పష్టమైనఅంచనాలేదు.

గత సంవత్సరం రిజర్వుబ్యాంక్ ఆఫ్ ఇండియా ఒక విచారణ జరిపి రిపోర్టు నొకదాన్ని ప్రచురించింది.

శాస్త్రీయ పరిశోధన సాగించడానికి చేయబడిన ప్రథమ ప్రయత్నం గావున దీన్ని ప్రామాణికంగా తీసుకోవచ్చు. ప్రభుత్వము, పబ్లికు సంస్థలు (Semi-Government) వ్యక్తిగత వ్యాపార లెక్కలన్నింటితోసహా మొత్తం దేశమంతటియొక్క విదేశ ఆస్తి, అప్పులకు సంబంధించినది యీ రిపోర్టు.

మనకు సంబంధించినంతవరకు, మన దేశంలోని విదేశీ పెట్టుబడుల్లో, వ్యక్తిగత వ్యాపార పెట్టుబడుల పరిస్థితిని చూడ్డం అవసరం. అందువల్ల నా పరిశీలనంతా యీ హంశానికే పరిమితం చేస్తాను.

స్వల్పకాలిక డిపాజిట్లు, అప్పులు, అడ్వాన్సుల జోలికి పోకుండా దీర్ఘకాలిక పెట్టుబడులనే పరిశీలించుదాము.

రిజర్వుబ్యాంకు రిపోర్టు, జూన్ 6, 1948 వరకు వున్న పరిస్థితిని మాత్రం యిస్తుంది. అందువల్ల ఆ తర్వాత ధోరణులను, మార్పులనూ పరిశీలించేముందు, జూన్ 6, 1948 నాటికి మన దేశంలోని విదేశ వ్యాపార పెట్టుబడుల పరిస్థితి యేమిటో చూద్దాం.

ఈ పెట్టుబడులు మన దేశంలోనికి వచ్చినపుడున్న మారకపు విలువతోనే చూచినట్లయితే భారతదేశంలోని విదేశీ వ్యాపార పెట్టుబడులు రూ. 320.42 కోట్లు అని రిపోర్టు చెబుతూన్నది. కాని షేర్లకు యిప్పుడున్న విలువనుబట్టి చూచినట్లయితే 519 కోట్ల రూపాయలుంటుంది.

రూ. 320.42 కోట్లు అనే సంఖ్య వాస్తవానికి చాలా తక్కువ అంచనా. మన విదేశీ వ్యాపారానికంతా ధనాన్ని సమకూర్చుతున్న, అత్యంత శక్తిసంపన్నమైన బ్యాంకులలోని పెట్టుబడి యిందులో చేర్చలేదు. అయినప్పటికి ఈ మొత్తాన్నే (రూ. 320.42 కోట్లు) తీసుకున్నప్పటికీ మన దేశ మొత్తం పెట్టుబడులలో విదేశీ పెట్టుబడులు అత్యంత ప్రాముఖ్యమైన స్థానాన్ని వహించాయని రుజువవుతుంది.

మనదేశంలో 1947-48 లో రిజిష్టరైన పబ్లిక్ కంపెనీలలో వున్న పెట్టుబడి మొత్తం 569.52 కోట్ల రూపాయలు. (భారత ప్రభుత్వ ఆర్థిక సలహాదారు 1949 లో ప్రకటించిన "స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్ట్స్").

విదేశాల్లో రిజిష్టరై, మనదేశంలో శాఖలున్న కంపెనీలలోని విదేశీ పెట్టుబడి మరో 145.76 కోట్ల రూపాయలూ పై మొత్తానికి చేర్చినట్లయితే, మనదేశంలోని వ్యాపార పెట్టుబడి మొత్తం 715.28 కోట్ల రూపాయలుగా తేలుతుంది.

మొత్తంలో, నూటికి 44.7 వంతుల వరకు విదేశీ పెట్టుబడియే వున్నది. దీనికి, బ్రిటిష్ బ్యాంకుల, భీమా కంపెనీల పెట్టుబడి, యితర స్వల్పకాలిక పెట్టుబడులు చేర్చినట్లయితే విదేశీ పెట్టుబడుల భాగం యింకా ఎక్కువౌతుంది.

మనదేశంలోని విదేశీ పెట్టుబడులు, మొత్తం పెట్టుబడిలో నూటికి 44.7 వంతులని తెలుస్తోంది. కాని, మన ఆర్థిక విధానంపై యీ విదేశీ పెట్టుబడులు చెలాయిస్తున్న విపరీతపు పెత్తనాన్ని యివి సరిగా ప్రతిబింబించడంలేదు.

కంపెనీల్లోనున్న మొత్తం పెట్టుబడిలో విదేశీయుల వాటా చాలా తక్కువే అయినా ఆ కంపెనీల్లో విదేశీయులే పెత్తనం వహిస్తున్నారని రిజర్వుబ్యాంకు రిపోర్టు తెలియజేస్తున్నది.

కొన్ని కంపెనీల్లో విదేశీయుల పెత్తనం నూటికి 60 నుండి 90 వంతుల వరకున్నది. కాని అధిక సంఖ్యాక కంపెనీలలో యిది తక్కువగానే వుంది. మనదేశంలోని 134 తేయాకు కంపెనీలలోనూ 96 కంపెనీల వరకు విదేశీ యాజమాన్యం నూటికి 40 వంతులకంటె తక్కువగా వుంది. మనదేశంలోని

389 విదేశీ కంపెనీల్లోనున్న 78 కోట్ల రూపాయలలోనూ విదేశీషేర్లు నూటికి 40 వంతులుమాత్రమే. మన దేశంలోనున్న మొత్తం 20 ఎలెక్ట్రిసిటీ కంపెనీలలోనూ 15 కంపెనీలలో విదేశీయాజమాన్యం నూటికి 20 వంతులకు తక్కువగానే వుంది.

విదేశీ మేనేజింగు ఏజన్సీల నిర్వహణలోనున్న కంపెనీల లోని మొత్తం షేర్లలో విదేశీ మేనేజింగ్ ఏజన్సీల వంతు నూటికి 14.6 మాత్రమే వుండడం ముఖ్యంగా గమనించాల్సిన విషయం. మన దేశంలోనున్న విదేశీ కంపెనీలయొక్క 347 శాఖ ల్లోనూ విదేశీ పెట్టుబడులు నూటికి 66 వంతులు మాత్రమే.

ఆ విధంగా సంస్థల్లోనూ, కంపెనీల్లోనూవున్న పెట్టు బడిలో కొద్ది వాటాలతోనే విదేశీ పెట్టుబడులు, మొత్తం కంపెనీలనే కంట్రోలు చేస్తున్నాయి.

పైగా, మన దేశంలోని విదేశీ వ్యాపార పెట్టుబడి మొత్తం 320. 42 కోట్ల రూపాయలలోనూ, నూటికి 79 వంతులు (253. 62 కోట్లు) 'ప్రత్యక్ష పెట్టుబడి'గావుంది. అంటె వీటిలో హక్కు భుక్తాలేగాక, ప్రత్యక్షంగా విదేశీయుల నిర్వహణలోనే వున్నాయి.

అయినప్పటికీ, యీ లెక్కలుగూడ పూర్తి చిత్రాన్ని తెలియజేయవు.

బలోపేతమైన ప్రపంచ గుత్తసంస్థల శాఖలుగానో, వాటి ఆదరువుతోనో వున్న మన దేశంలోని విదేశీ కంపెనీలు, భారతీయ కంపెనీలకంటె అత్యంత ప్రభావమూ, పలుకుబడీ, పెత్తనమూ కలిగివున్నాయి.

మన ఆర్థిక వ్యవస్థలోని వివిధశాఖల్లోనున్న విదేశీ పెట్టుబడుల మొత్తాన్ని రిజర్వు బ్యాంకు రిపోర్టు యిలా తెలియజేస్తున్నది.

| | | |
|---|---|---|
| ఉత్పత్తి కేంద్రాలు (Manufacturing) | 66.84 | కోట్లు |
| వర్తకం | 85.32 | ,, |
| జీవితావసర వస్తువుల ఉత్పత్తి (Utilities) | 20.58 | ,, |
| రవాణా ... | 15.20 | ,, |
| గనులు ... | 13.01 | ,, |
| ద్రవ్యరూపంలో ... | 46.53 | ,, |
| ఇతరములు ... | 72.94 | ,, |
| వెరశి ... | 320.42 | కోట్లు |

ఈ మొత్తంలో దాదాపు సగం 10 'రంగాల'లోనే వుంది.

| | | |
|---|---|---|
| జనపనార పరిశ్రమ ... | 15.74 | కోట్లు |
| ప్రత్తి ,, ... | 11.70 | ,, |
| ఇనుము, ఉక్కు వగైరా ... | 6.52 | ,, |
| నూనె గనులు ... | 22.57 | ,, |
| విద్యుచ్ఛక్తి ... | 19.35 | ,, |
| నౌకా పరిశ్రమ ... | 8.88 | ,, |
| పెట్టుబడులు (ముఖ్యంగా మేనేజింగ్ ఏజన్సీలు) | 16.94 | ,, |
| తేయాకు తోటలు ... | 51.62 | ,, |
| కాఫీ ,, ... | 1.21 | ,, |
| బొగ్గు గనులు ... | 4.94 | ,, |
| వెరశి ... | 159.47 | కోట్లు |

పై పట్టికలో చూపబడినట్లు వర్తక సంస్థల్లో, అత్యధిక మొత్తం (85.32 కోట్ల రూ) విదేశీపెట్టుబడి వున్నది. దీనిలో నూటికి 90 వంతులు 'ప్రత్యక్ష' పెట్టుబడియే. దానితోపాటే విదేశీ పెత్తనంకూడా వుంది. తరువాత ఇతరముల గ్రూపు (ముఖ్యంగా మానేజింగ్ ఏజన్సీలక్రిందనున్న సంస్థలు) కు 72.94 కోట్ల రూపాయల విదేశీపెట్టుబడి వుంది. దీనిలో నూటికి 82 వంతులు (60.02 కోట్లు) 'ప్రత్యక్ష' పెట్టుబడియే.

రిజర్వుబ్యాంకు రిపోర్టులో, యింతవరకు ప్రచురింపబడని కొన్నిభాగములు, మంత్రివర్గ సెక్రటేరియటు, ప్రధానమంత్రికి సమర్పించిన మెమోరాండములో చేర్చబడ్డాయి. భారత ఆర్థిక విధానంపై విదేశీపెట్టుబడులకున్న పెత్తనాన్ని యివి స్పష్టంగా బయల్పరుస్తాయి.

5 లక్షలు, అంతకుమించి, చెల్లింపబడినపెట్టుబడి(Paid up) గల 1062 కంపెనీలలోనూగల విదేశీ, స్వదేశీ పెట్టుబడుల పరిస్థితిని యిక్కడ పరిశీలించడమైనది. వీటిలో 93 కంపెనీలు పూర్తిగావిదేశాల్లోనేస్థాపించబడ్డ విదేశకంపెనీలు. విదేశీయుల పెత్తనంక్రింద నున్న భారతీయ కంపెనీల సంఖ్య 306 పోగా మిగిలిన 663 భారతీయుల చేతుల్లోనున్న కంపెనీలు.

మొత్తం పెట్టుబడికీ, విదేశీ పెత్తనంలోనున్న కంపెనీలకూ మధ్య సంబంధం యీ క్రింది పట్టికలో చూడండి.

| మొత్తం పెట్టుబడిలో సగానికి పైగా విదేశీయుల పెట్టుబడియున్న కంపెనీలు | మొత్తం కంపెనీలలో విదేశ కంపెనీల శాతం | మొత్తం పెట్టుబడిలో విదేశీ పెట్టుబడుల శాతం |
|---|---|---|
| 1. పెట్రోలియం | 75% | 97% |
| 2. రబ్బరు పరిశ్రమ | 75% | 93% |
| 3. చిన్నతరహా రైల్వేలు | 77% | 90% |
| 4. అగ్గిపెట్టెలు | 60% | 90% |
| 5. జనపనార | 80% | 89% |
| 6. తేయాకు | 81% | 86% |
| 7. గనులు (బొగ్గుమినహా) | 62% | 73% |
| 8. బొగ్గు | 69% | 62% |
| 9. రబ్బరు తోటలు | 25% | 54% |

## నూటికి 25-50 వంతుల మధ్య విదేశీ పెట్టుబడులుగల కంపెనీలు

| | | |
|---|---|---|
| 10. ద్రవ్య పెట్టుబడులు | 19% | 46% |
| 11. విద్యుచ్ఛక్తి | 52% | 43% |
| 12. ఇంజనీరింగ్ | 31% | 33% |
| 13. కాఫీ | 19% | 37% |
| 14. ఆహారం | 16% | 32% |
| 15. కాగితం | 29% | 28% |

## నూటికి 25 కన్న తక్కువ విదేశీ పెట్టుబడులున్న కంపెనీలు

| | | |
|---|---|---|
| 16. పంచదార | 25% | 24% |
| 17. నూలుబట్టలు | 16% | 21% |
| 18. సిమెంటు | 12% | 5% |

(వివరణ:-పై పట్టికలో వరుసవారీగా, మొత్తం కంపెనీలలో విదేశీ కంపెనీల శాతం (% మొదటి కాలంలోనూ, మొత్తం పెట్టుబడిలో విదేశీ పెట్టుబడుల శాతం రెండవ కాలంలోనూ, ఇవ్వబడినవి. ఉదా॥ ద్రవ్య పెట్టుబడుల సంస్థల్లో విదేశీ కంపెనీలు నూటికి 19 మాత్రమే వున్నా, మొత్తం ద్రవ్య పెట్టుబడుల్లో నూటికి 46 వంతులు విదేశీ పెట్టుబడియే-అనువాదకుడు)

భారతదేశంలో బ్రిటిష్ పెట్టుబడులు:-34 బ్రిటిష్ గుత్త సంస్థలు, దాదాపు 75½ కోట్ల రూపాయల మూలధనంతోనున్న 400 పారిశ్రామిక సంస్థలను కంట్రోలు చేస్తున్నాయి. అధిక భాగం విదేశీ సంస్థల్లో అధిక భాగం సంస్థల్లో భారతీయులను చేర్చుకున్నారు. ఉదా॥ ఆండ్రూ యూల్ అండ్ కో., లో జటీస్ బ్రదర్స్ మార్టిన్ బరన్ లిమిటెడ్‌లో ముఖర్జీలు వగైరా !

## విదేశీ మానేజింగ్ ఏజన్సీల కంట్రోలు

| మానేజింగ్ ఏజన్సీ | మానేజ్ చేయబడుతున్న కంపెనీల సంఖ్య | | |
|---|---|---|---|
| | బొగ్గు | జూట్ | టీ |
| ఆండ్రూయూల్ అండ్ కో | 10 | 11 | 16 |
| షా వాలెస్ కంపెనీ | 5 | - | 6 |
| కిల్‌బర్న్ అండ్ కో | 1 | - | 7 |

| | బొగ్గు | జనపనార | టీ |
|---|---|---|---|
| హెచ్. డబ్ల్యు. లా అండ్ కో | 5 | – | – |
| యఫ్. డబ్ల్యు. హీలర్స్ | 6 | 2 | – |
| ఆండర్సన్ రిట్ అండ్ కో | 2 | 1 | – |
| బర్డ్ అండ్ కో | 2 | 8 | – |
| మెక్‌నీల్ అండ్ కో | 5 | 2 | – |
| జార్డిన్ హెండర్సన్ అండ్ కో | 1 | – | – |
| విలియర్స్ లిమిటెడ్ | 3 | – | 1 |
| బామర్ లారీ అండ్ కో | 1 | – | – |
| ఆక్టేవియస్ స్టీల్ కంపెనీ | 1 | – | 13 |
| గిలాండర్సు ఆర్‌బత్‌నాట్ | 1 | 2 | 6 |
| విలియం మాగోర్ అండ్ కో | 1 | – | – |
| జెగ్ డన్‌లప్ | – | 4 | 8 |
| డంకన్ బ్రదర్స్ | – | 1 | 25 |
| జార్జి హెండర్సన్ అండ్ కో | – | 2 | – |
| జేమ్సు ఫిన్లే | – | 1 | 2 |
| మెక్‌లియోడ్ అండ్ కో | – | 5 | 6 |
| కెటిల్ విల్ బుల్లర్ అండ్ కో | – | 2 | 1 |
| బారీ అండ్ కో | – | 2 | – |
| జార్డిన్ స్కిన్నర్ అండ్ కో | – | 4 | 4 |
| మెకినాన్ మెకంజీ అండ్ కో | – | 2 | – |
| విలియంసన్ మాగోర్ అండ్ కో | – | – | 13 |
| డెవన్‌పోర్ట్ అండ్ కంపెనీ | – | – | 9 |

| | | | |
|---|---|---|---|
| హార్ మిల్లర్ అండ్ కో | – | – | 1 |
| ప్లాంటర్స్ స్టోర్ అండ్ ఏజన్సీ కంపెనీ | – | – | 2 |
| బులియర్జ్ అండ్ కో | – | – | 1 |
| విదేశీయుల యాజమాన్యంలో | 44 | 49 | 121 |
| మొత్తం సంస్థలు ... | 62 | 62 | 137 |

(కొఠారీ వ్రాసిన "ఇన్ వెస్టర్స్ ఎన్ సైక్లోపీడియా" 1948)

## బ్రిటిష్ మానేజింగ్ ఏజన్సీలు, వాటి విస్తృతి

| ఏజన్సీ పేరు | శాఖల సంఖ్య |
|---|---|
| 1. అండ్రూ యూల్ అండ్ కో | 78 |
| 2. గిలాండర్సు ఆర్ బత్ నాట్ కో | 70 |
| 3. డంకన్ బ్రదర్స్ లిమిటెడ్ | 58 |
| 4. ఆక్టేవియస్ స్టీల్ అండ్ కో లిమిటెడ్ | 57 |
| 5. బర్డ్ అండ్ కో లిమిటెడ్ | 42 |
| 6. మెక్లీన్ అండ్ కో | 41 |
| 7. మెక్లియడ్ అండ్ కో | 39 |
| 8. షా వాలెస్ అండ్ కో | 37 |
| 9. కిల్ బర్న్ అండ్ కో | 30 |
| 10. బామర్ లారీ అండ్ కో | 29 |
| 11. బెగ్ డన్ లప్ అండ్ కో., | 25 |
| 12. కిల్లిక్ నిక్సన్ అండ్ కో | 17 |
| 13. జార్డిన్ స్కిన్నర్ | 16 |

| ఏజెన్సీ పేరు | శాఖల సంఖ్య |
|---|---|
| 14. బారీ అండ్ కో | 14 |
| 15. మొవాన్ బ్రదర్స్ లిమిటెడ్ | 14 |
| 16. యఫ్. డబ్లియు. హీలర్స్ అండ్ కో | 13 |
| 17. మెకినాన్ మెకంజీ అండ్ కో | 11 |
| 18. జార్జి హెండర్సన్ అండ్ కో | 10 |
| మొత్తం | 601 |

## భారతీయ మానేజింగ్ ఏజన్సీలు

| ఏజెన్సీ పేరు | శాఖల సంఖ్య |
|---|---|
| 1. బిర్లా బ్రదర్స్ లిమిటెడ్ | 61 |
| 2. మార్టిన్ కో, బర్న్ కో | 44 |
| 3. జె. కె. ఇండస్ట్రీస్ | 40 |
| 4. తాతా అండ్ సన్స్ లిమిటెడ్ | 25 |
| 5. కరమ్‌చంద్ థాపర్ బ్రదర్స్ లిమిటెడ్ | 23 |
| 6. దాల్మియా జైన్ లిమిటెడ్ | 19 |
| 7. ప్రీమియర్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ | 18 |
| మొత్తం | 230 |

(1947 నవంబరు "కమ్యూనిస్టు" లో అరున్ బోస్ వ్రాసిన "ఆర్థిక సంక్షోభం - భారత పెట్టుబడిదారీ వర్గం" నుండి).

జూన్ 30, 1948 నాటికి కొన్ని పరిశ్రమల పరిస్థితిని చర్చిస్తూ, రిజర్వుబ్యాంకు రిపోర్టు యిలా తెలియజేస్తున్నది.

జనపనార :—65 సంస్థలలోనూ 51 సంస్థలు (80%) విదేశీయుల నిర్వహణ క్రింద వున్నాయి. మొత్తం 12,75,000 పౌనులతో బ్రిటన్‌లోనే స్థాపించబడిన 3 కంపెనీలు కూడా దీనిలో చేర్చబడ్డాయి. మిగిలిన 48 కంపెనీలు ఇండియాలోనే రిజిష్టరు చేయబడ్డాయి. వాటిపై పెత్తనం మాత్రం విదేశీ సంస్థలదే.

బొగ్గు :—బొగ్గు కంపెనీలలో 2/3 వంతులు విదేశీ సంస్థల పెత్తనం క్రింద వున్నాయి. వీటిలో, ఆండ్రూయూల్ అండ్ కో; యఫ్. డబ్లియు. హీలర్స్ అండ్ కో; మెక్నిల్ అండ్ కో; షా వాలెస్ అండ్ కో కంపెనీలు ప్రధానమైనవి. రాణీగంజ్, ఝరియాలలోని మేలురకం బొగ్గు వీరి చేతులలోనే వుంది. మొత్తం 82 బొగ్గు కంపెనీలలో (5 లక్షలు పైగా పెట్టుబడి గలవి) 32 మాత్రమే భారతీయులు నిర్వహిస్తున్నారు. వీటిలో కొన్ని అమ్మకంచేసే కంపెనీలు మాత్రమే.

విద్యుచ్ఛక్తి సరఫరా:- 5 లక్షలుపైగా పెట్టుబడిగల్గిన విద్యుచ్ఛక్తి కంపెనీలు మొత్తం 57 వున్నాయి. 54 ఇండియాలోనూ, 3 ఇంగ్లండులోను రిజిష్టరు చేయబడ్డాయి. వీటిలో 24 కంపెనీలలో, భారతీయ డైరెక్టరులే మెజారిటీగా వున్నప్పటికీ, విదేశీయుల నిర్వహణ క్రిందే వున్నాయి.

రసాయన పదార్థాలు;-రసాయన పదార్థాలు, మందులు, ఎరువులకు సంబంధించిన కంపెనీలు 46 భారతదేశంలో రిజిష్టరు చేయబడ్డాయి. వీటిలో నాలుగు మాత్రము విదేశీయుల నిర్వహణక్రింద వున్నాయి. పారిశ్రామిక రసాయనిక పదార్థా

లకు సంబంధించినంతవరకు విదేశీ సంస్థలే ప్రధానవుత్పత్తి దారులుగా వున్నాయి.

బొగ్గుమినహా ఇతర గనులు (మాంగనీస్, ఇనుము, రాగి, అభ్రకము, బాక్సయిట్ వగైరా):- 22 కంపెనీలలోను 12 కంపెనీలు విదేశీయుల నిర్వహణక్రింద వున్నాయి.

తోటలు:- మొత్తం 336 కంపెనీలలోనూ రూ 116 మాత్రం భారతీయుల నిర్వహణక్రింద, మిగతా 220 విదేశీయుల నిర్వహణక్రింద వున్నాయి.

| ఇంజనీరింగ్ | విదేశీయుల యాజమాన్యంలో | స్వదేశీయుల యాజమాన్యంలో | మొత్తం |
|---|---|---|---|
| ఎలెక్ట్రికల్ | 7 | 15 | 22 |
| యంత్రాలకు సంబంధించిన పనిముట్లు (మెకానికల్) | 1 | 20 | 21 |
| మోటార్లకు కావలసిన పనిముట్లు | 3 | 7 | 10 |
| ఇనుము, ఉక్కు | 2 | 10 | 12 |
| మెత్తటిలోహాలు | 0 | 5 | 5 |
| పింగాణీ | 1 | 11 | 12 |
| నౌకా, రైల్వే | 2 | 2 | 4 |
| నిర్మాణం (స్ట్రక్చరల్ కన్‌స్ట్రక్షన్) | 8 | 9 | 17 |
| సాధారణ | 4 | 5 | 9 |
| మొత్తం | 28 | 84 | 112 |

విదేశీమానేజింగ్ ఏజన్సీల పెత్తనంక్రిందఉన్న రెండు ఇనుము, ఉక్కు కంపెనీల నిర్వహణలో భారతీయులు పాల్గొంటున్నారని ఆ రిపోర్టు చెబుతూంది.

పై పరిస్థితి జూన్ 30, 1948 నాటిది. ఇది చూచినట్లయితే మన ఆర్థిక విధానంలో విదేశీపెట్టుబడులు ఎంతటి కీలకమైన,పలుకుబడిగల్గినస్థానంలోవున్నాయో బోధపడుతుంది.

మనదేశంలోని విదేశీపెట్టుబడులు బలహీన పడినవనీ, మనఆర్థిక విధానంపైనున్న విదేశీపట్టు తొలగిపోయినదనీ, జనపనార, బొగ్గు, తోటలు వగైరా పరిశ్రమల్లో బ్రిటిష్‌వారి చేతులనుండి భారతీయులకు పెద్దఎత్తున మార్పిడి జరిగిందనీ, యీ రోజున మన పరిశ్రమల్లో అత్యధికభాగం భారతీయ పెట్టుబడిదార్ల చేతుల్లోనే వున్నాయనీ, కొందరు స్వప్రయోజనపరులు చేస్తున్న బుద్ధిపూర్వక ప్రచారాన్ని అతిశయోక్తిగా ఎంచి నిరాకరించవలసి వుంటుంది.

అంతకు పూర్వంవలెనే విదేశీ పెట్టుబడి మన ఆర్థిక విధానాన్ని తన ధృతరాష్ట్ర కౌగిలిలో బిగించియే వుంచింది.

కొన్ని వాటాలు భారతీయుల చేతులలోకి మారడం, నిర్వహణలో భారతీయులు పాల్గొంటున్నారని చెప్పడం, కొన్ని కంపెనీలలో భారతీయ డైరెక్టర్లను చేర్చుకోవడం, వగైరాలతో విదేశీయుల పెత్తనం సడలిందనడానికి ఎట్టి నిదర్శనమూ లేదని రిజర్వుబ్యాంకు రిపోర్టు స్పష్టంచేస్తున్నది.

24 ఎలక్ట్రిసిటీ సప్లై కంపెనీలలో భారతీయ డైరెక్టర్లే అత్యధికులుగా నున్నప్పటికీ, అవి విదేశీయుల నిర్వహణక్రిందనే వుండిపోయాయి.

యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరమూ, ముఖ్యంగా బూటకపు స్వతంత్రం వచ్చినతర్వాత దశల్లోనూ, జరిగిన ఘటనలు, మార్పుల వైపుకు పోయేముందు మన దేశంలోని విదేశ పెట్టుబడిలో వివిధ దేశాల వాటాలు చూద్దాం.

రిజర్వుబ్యాంకు రిపోర్టులో యిలావుంది:

"మొత్తం విదేశీ పెట్టుబడి 320.42 కోట్ల రూపాయల లోనూ బ్రిటిష్ పెట్టుబడియే సుమారు 230.14 కోట్ల రూపాయల (72%) తో ప్రముఖపాత్ర వహిస్తున్నది. ఈ మొత్తంలో (230.14 కోట్లు) ఇంగ్లండునుండి వచ్చిన 'ప్రత్యక్ష' పెట్టుబడుల విలువ 180 కోట్ల రూపాయలు (82%).

"18 కోట్ల రూపాయల వ్యాపార పెట్టుబడులతో అమెరికా ద్వితీయ రుణదాతగా వుంది. దీనిలో 17 కోట్లు 'ప్రత్యక్ష' పెట్టుబడుల రూపంలో వుంది".

"ఇదివరకు ఒకటిగానేవున్న భారత పాకిస్తాన్ ఆర్థిక నిర్మాణంయొక్క ప్రాముఖ్యత 3 వ స్థానాన్ని అలంకరిస్తున్నది. దాదాపు 15 కోట్ల రూపాయల పెట్టుబడులున్నాయి. దీనిలో 11 కోట్లవరకు 'ప్రభుత్వ' రుణాలుగా వున్నాయి. (కంట్రోలు లేనిది —రచయిత).

"89 కోట్ల రూపాయల పెట్టుబడితో బ్రిటిష్ వెస్టు ఇండీస్ నాలుగవ స్థానాన్ని ఆక్రమిస్తుంది. అవరోహణక్రమంలో మిగిలిన దేశాలు యిలా వున్నాయి. స్విడ్జర్లాండ్ (6.01 కోట్లు) కెనడా (5.73 కోట్లు) నేపాల్ (4.37 కోట్లు)."

"ఇంగ్లండుకు భారతదేశంతో గల సన్నిహిత సంబంధాలను యీ అంకెలు ప్రతిబింబిస్తున్నాయని" రిజర్వుబ్యాంకు రిపోర్టులో ఒకచోట చెప్పబడింది.

జూన్ 30, 1948 పరిస్థితి చూచినట్లయితే మనదేశంలోని విదేశీ పెట్టుబడులలో బ్రిటిష్‌సామ్రాజ్యవాద పెట్టుబడియే ఆధిపత్యం వహిస్తున్నదనీ, తద్వారా మన ఆర్థిక విధానంపైననే పెత్తనం వహిస్తున్నదనీ, స్పష్టంగా తెలుస్తూనేవుంది.

బ్రిటిష్ పెట్టుబడి మొత్తం 230 కోట్ల రూపాయలతో పోల్చినపుడు అమెరికా పెట్టుబడి 18 కోట్లు మాత్రమే. మన దేశంలో 'ప్రత్యక్ష' పెట్టుబడులుగానే చాలాభాగం వుండి, వివిధ 'రంగాల'లో యాజమాన్యపు ప్రయోజనాలు, హక్కు-భుక్తములూ గలిగినవాటితోసహా, రెండుదేశాలపెట్టుబడులనూ పోల్చినట్లయితే యీ తేడా మరింత స్పష్టమగును.

| పరిశ్రమలు | బ్రిటన్ | అమెరికా |
|---|---|---|
| | లక్షల రూపాయలలో | |
| ఉత్పత్తి (Manufacturing) | 4642 | 493 |
| వర్తకం | 6729 | 518 |
| జీవితావసర వస్తువుల ఉత్పత్తి (Utilities) | 1953 | 1 |
| రవాణా | 1125 | 3 |
| గనులు | 1090 | 18 |
| ద్రవ్య పెట్టుబడులు | 770 | 696 |
| ఇతరములు | 6705 | 68 |
| మొత్తం | 23014 | 1797 |

## యుద్ధానంతరపు ప్రధానమైన మార్పులు

విదేశీ పెట్టుబడుల పరిస్థితిని జూన్ 30, 1948 వరకు పరిశీలించి రిజర్వుబ్యాంకు రిపోర్టు తయారు చేయబడినప్పటికీ, యుద్ధకాలంలోనూ, యుద్ధానంతర దశప్రారంభంలోనూ, పొడచూపిన కొన్నిధోరణులను క్లుప్తంగా పరీక్షించడం అవుసరం.

మన దేశంలోని బ్రిటిష్‌వ్యాపారుల పత్రికయైన "కాపిటల్" ఒకవ్యాసంలో యిలా చెప్పింది:

"యుద్ధావుసరాలకోసం, సప్లయిలకోసం తూర్పురంగమంతా సాధారణంగా భారతదేశంపైననే ఎక్కువగా ఆధారపడటమూ, అంతర్గత ధరలలో విపరీతమైన పెరుగుదల (అంటే యుద్ధకాలపు నోట్ల ముమ్మరం, హద్దులేని లాభాలు, భారతప్రజలను అమానుషంగా దోపిడిచేయడం - రచయిత) ఫలితంగా భారతీయ వ్యాపారుల చేతిలోని పెట్టుబడి విపరీతంగాపెరిగింది.

"యుద్ధపురోజుల్లో యంత్రాల దిగుమతులు లేకపోవడం, కొత్త పరిశ్రమలలో పెద్దపెట్టున పెట్టుబడి పెట్టలేకపోవడంవల్ల భారతీయుల చేతులలో కొత్తగా పోగైన యీ ధనము తప్పనిసరిగా విదేశీయుల యాజమాన్యంలోనున్న, సుస్థిరమైన పరిశ్రమలవైపుకే మొగ్గింది." ("కాపిటల్" డిశెంబరు 1949)

దీనితోపాటు, యుద్ధానంతర విప్లవ సంరంభములో మనదేశంలోని బ్రిటిష్, ఇండియన్ గుత్త ధనాధిపతుల (Financiers) హృదయాల్లో ఆందోళన రేగింది. దానితో స్థూలంగా మూడు మార్పులు జరిగాయి.

1. బ్రిటిష్ సంస్థలను భారతీయులు పాక్షికంగానో, మొత్తంగానో, కొనివేయడం;

2. పాత, కొత్త సంస్థల్లో భారతీయులు, బ్రిటిష్‌వారూ కలిసిపోవడం, అంటే బ్రిటిష్ - భారతీయ సంయుక్త యాజమాన్యం;

3. విదేశీ కంపెనీల నిర్వాహణలో భారతీయులు మరింతగా పాల్గొనడం.

ఈ మార్పుల్లో ఒక్కొక్కదాన్ని పరిశీలించుదాం.

1. ఇండియాలోని బ్రిటిష్ సంస్థల అమ్మకానికి సంబంధించినంతవరకు లభ్యమైన సాక్ష్యమంతా యీ అమ్మకం ఏమంత ఎక్కువగా లేదని సూచిస్తున్నది.

కామన్సులో 1946 జులైలో ప్రసంగిస్తూ డాక్టర్ డాల్టన్ భారతదేశంలోని బ్రిటిష్ ఆస్తుల అమ్మకం "కొద్దిగా మాత్రమే" జరిగిందని తెలియ చేశాడు.

2. జరిగిన అమ్మకా లేమైనావుంటే, అవి అరిగిపోయిన మిషన్లు, ఫాక్టరీలు మాత్రమే. అవికూడా విపరీతమైన ధరలకు అమ్మడంజరిగింది. కాన్పూరులోని స్వదేశీ కాటన్ మిల్లును 4 కోట్లరూపాయలకమ్మడం దీనికి వుదాహరణగా పేర్కొనవచ్చు.

3. అమ్మగా వచ్చిన ధనంలో అత్యధికభాగం తిరిగి ఇండియాలోనే పెట్టుబడిగా పెట్టడం జరిగింది. 1951 సెప్టెంబరులో పార్లమెంటులో మాట్లాడుతూ, భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రి శ్రీ సి. డి. దేశముఖ్, 1947 జులై నుండి 1950 చివరి వరకు 45 బ్రిటిష్ కంపెనీలు, మానేజింగ్ ఏజన్సీలను, భారతీయులు 85,80,000 పౌనులకు కొన్నారని చెప్పారు.

"భారతీయేతరులు అమ్మిన సంస్థలలోని మొదటి పెట్టుబడి (Capital originally invested) కి సంబంధించిన సమాచారం లేదని" కూడా ఆయనే చెప్పారు. ఈ దశ అంతటిలోనూ 44 కోట్ల రూపాయిల బ్రిటిష్ పెట్టుబడి మాత్రమే స్వదేశానికి పోయిందని ఆర్థిక మంత్రి 1951 మేలో తెలియజేశారు.

రెండో యుద్ధకాలంలో ఇంగ్లండు తన విదేశాల పెట్టుబడిలో (over seas) మూడో భాగం (పౌనులు 11,180 లక్షలు) కోల్పోయింది. దీనిలో ఒక్క చిల్లిగవ్వ కూడా ఇండియాలో పోలేదు.

భారత - బ్రిటిష్ పెట్టుబడుల సంలీనంవల్ల ఏర్పడిన భారత - బ్రిటిష్ సంయుక్త కంపెనీల నిర్మాణక్రమం మాత్రం నిస్సందేహంగా పెద్దఎత్తుననే జరిగింది. కాని దీనివల్ల మన ఆర్థిక వ్యవస్థపై బ్రిటీషుకుగల పట్టు ఏమాత్రమూ బలహీనపడలేదు.

ఇట్టి ఒడంబడికల షరతులను చూచినట్లయితే కీలక పాత్ర బ్రిటిష్‌వారి హస్తాలలోనే మిగిలిపోయింది; భారత దేశాన్ని పారిశ్రామికం చేయడానికి యివి వుద్దేశించబడలేదు; నాల్గు మెతుకుల కాశించిన భారతబడా వ్యాపారుల సహాయంతో, వత్తాసుతో, భారత ప్రజలను ఎప్పటిలాగే తీవ్రంగా దోచుకొనడానికి ముసుగుగా మాత్రమే యివి వుపయోగిస్తున్నాయి.

అయితే యీ సంయుక్త భాగస్వామ్య విధానం కూడా 1948 తర్వాత దాదాపు పూర్తిగా ఆగిపోయింది. కొన్ని కొత్త పథకాల విషయంలో మాత్రమే యీ సంయుక్త భాగస్వామ్యమనే పదం యిప్పుడు వినబడుతున్నది.

విదేశీయుల పెత్తనంలోనున్న కంపెనీల నిర్వహణలో భారతీయులు పాల్గొంటున్నారనీ, విదేశీ కంపెనీలలో భార

తీయులు డైరెక్టర్లుగా చేర్చబడుతున్నారనీ, చెప్పబడుతున్న విషయమైచూచాం. ఇట్టి నామమాత్రపు మార్పులవల్ల విదేశీ కంట్రోలుగాని, యాజమాన్యంగాని చెక్కుచెదరదని పైననే చూచాం.

"స్వతంత్ర"భారత రిపబ్లిక్ అవతరించడానికి పూర్వమే, బ్రిటిష్ పెట్టుబడులతోనున్న కంపెనీల డైరెక్టర్ల బోర్డులో భారతీయులకు స్థానాలియ్యడం జరుగుతున్నదని అందరూ ఎరిగున్నదే. 1947 ఆగస్టుకు పూర్వంకూడా కాంగ్రెసు ప్రారంభించిన బ్రిటిష్ వ్యతిరేక పోరాటాలను దాని నాయకత్వం వుపసంహరించినపుడల్లా, యిలా యివ్వడం జరుగుతూనే వుంది. ఇట్టి వుపసంహరణలు జరిగిన తర్వాత ప్రతి సందర్భంలోను, భారతీయ ధనాధిపతుల (financial) గ్రూపుల యొక్క కొన్ని పరిశ్రమలకు పాక్షికమైన రక్షణ యివ్వడమో, భారతీయ డైరెక్టర్లబోర్డుతో సంస్థలు నెలకొల్పడమో, బ్రిటిష్ లేదా బ్రిటిష్-భారతీయ సంయుక్త పెట్టుబడులతో కంపెనీలు స్థాపించడమో జరుగుతూనే వచ్చింది. 1921 వుద్యమం తర్వాత ఏం జరిగిందో మనం గుర్తుచేసుకోవడం అవుసరం. ఆ వుద్యమం వుపసంహరించుకోగానే టాటా ఉక్కు పరిశ్రమకు రక్షణ యివ్వడం, "సంస్కరింపబడిన" అసెంబ్లీలలో కాంగ్రెసువారు పునఃప్రవేశించడంతో రూపాయి పెట్టుబడుల చట్టం (Law on rupee Capital) భారత బట్టలపై ఎక్సైజు సుంకాలు రద్దుచేయడం వగైరాలు జరిగాయి. పూర్తిగా విదేశీ పెట్టుబడితో నడుస్తున్న విమ్కో అగ్గిపెట్టెల గుత్తసంస్థయొక్క డైరెక్టరులంతా భారతీయులే. టాటా ఉక్కుపరిశ్రమ, ఇంకా

ఇతర సంస్థలుకూడా భారతీయడైరెక్టర్లే పూర్తిగా వున్నప్పటికీ, ఆసంస్థలు బ్రిటిష్, అమెరికన్ రుణపత్రాల గుప్పెట్లోనేవున్నవి.

ఈ విధంగా, ఒకసంస్థ విదేశీయుల పెత్తనంలో లేదనీ, భారత ఆర్థిక వ్యవస్థయొక్క ప్రయోజనాలకోసమే పనిచేస్తున్న దనీ చెప్పడానికి, ఆ సంస్థయొక్క నిర్వహణలో భారతీయులు పాల్గొనడమూ, లేదా పూర్తిగా భారతీయ డైరెక్టరులే వుండడం మాత్రమే హామీగాదని తేలుతున్నది.

ఈ క్రమము యుద్ధానంతరం తీవ్రమైంది. "భారతీయ డైరెక్టర్ల విషయం అలావుంచి మిగతా విషయాలెలా వున్న ప్పటికీ, పరిశ్రమలు నిర్మింపబడుతున్న దశలో భారతీయులే మెజారిటీగావుండి కంట్రోల్ చేయాలని భారత ప్రభుత్వం పట్టు బట్టదలచడంలేదు. (హిందూ, సెప్టెంబరు 19, 1949) అని భారత ప్రభుత్వం 1949 లో ప్రకటనలు చేయడంతో యీ క్రమం నిలిచిపోయింది.

యుద్ధానంతర రాజకీయ విప్లవోద్యమాన్నీ, వెల్లువనూ గాంచి గడగడలాడిన బ్రిటిష్‌పెట్టుబడిదారులు, యీ విధంగా 1949 మొదట్లోనే తమస్థానాన్ని గట్టిపర్చుకున్నారు. ఈ విష యాన్ని లండన్‌లోని "ఫైనాన్షియల్ టైమ్సు" పత్రిక అంగీక రించింది.

"రెండో యుద్ధకాలంలో పాక్షికంగా బలహీనపడిన భారత దేశంలోని బ్రిటిష్ పెట్టుబడులు తిరిగి వెనుకటి స్థానాన్ని సంపా దించ నారంభించాయి" అని ఏ. యం. డైకోవ్ వ్రాశారు.

రెండోవైపున దేశంలోనికి మరింత బ్రిటిష్ పెట్టుబడి వస్తూనే వున్నది. గత మూడు, నాల్గు సంవత్సరాల్లో మన

దేశానికి దిగుమతియైన బ్రిటిష్ పెట్టుబడినిగూర్చి సరైన అంచనా వేయడం యీ దశలో సాధ్యంగాదు. ఈ విషయంపై ప్రభుత్వం ఎలాంటి లెక్కలూ ప్రకటించలేదు.

భారతదేశంలోని బ్రిటిష్ ధనాధిపతులు, దేశంలో జరుగుతున్న పెట్టుబడి మారకాలను రిజర్వుబ్యాంకు గుర్తించడానికి వీలులేకుండా, అనేక ట్రిక్కులు, కుతంత్రాలద్వారా ప్రయత్నించి జయప్రదమౌతున్నారు.

భారతదేశంలోనికి దిగుమతియైన బ్రిటిష్ పెట్టుబడికి సంబంధించిన యధార్థమైన సమాచారము ఏమీలేదు. అయితే రిజర్వుబ్యాంకుయొక్క మారకపు ఖాతాలో కనపడే అతిస్వల్ప భాగానికి సంబంధించిన సమాచారంమాత్రం వుంది.

ఢిల్లీనుండి వెలువడే 'స్టేట్స్‌మన్' పత్రికలో నవంబరు 25, 1949 తేదీన యీ క్రింది రిపోర్టు వుంది:

"గత సంవత్సరపు మొత్తం పారిశ్రామిక పెట్టుబడి 5.14 కోట్ల రూపాయలలోనూ విదేశీ పెట్టుబడి 4.48 కోట్ల రూపాయల వరకూ వుంది. ఈ సంవత్సరపు పారిశ్రామిక పెట్టుబడి మొత్తం 16.96 కోట్ల రూపాయలు".

అప్పుడు భారత ప్రభుత్వ ఆర్థిక మంత్రిగానున్న డాక్టర్ జాన్‌మత్తయ్ పార్లమెంటులో ప్రసంగిస్తూ, మన దేశంలోనికి (1948-49 లో బ్రిటన్‌నుండి 5.0 కోట్లు; కెనడానుండి 1.6 లక్షలు; సిలోన్ నుండి 1.5 లక్షలు పెట్టుబడి దిగుమతియైనదని వెల్లడించారు. ఈ దశలో అమెరికన్ పెట్టుబడి దిగుమతికాలేదు.

1949 లో బ్రిటన్‌నుండి 1.57 కోట్లు, హాంకాంగ్‌నుండి 1.2 లక్షలూ, అమెరికానుండి 16,500 రూపాయలూ పెట్టు

బడిగా దిగుమతియైనదని ఆయన చెప్పారు. ఆయన చెప్పినదాని ప్రకారం 1950 సంవత్సరం మొదటి ఆరు నెలల్లోను మన దేశంలో పెట్టుబడి పెట్టడానికిగాను ఇంగ్లండునుండి 23 లక్షల రూపాయలు వచ్చిందనీ, దానిలో సగం పబ్లిక్ కంపెనీలలో పెట్ట బడిందనీ తెలుస్తున్నది.

అంటే 1948 జులై నుండి 1950 జూన్ వరకు 6.34 కోట్ల రూపాయల బ్రిటిష్ పెట్టుబడి మన దేశంలోనికి వచ్చింది. ("ఈస్టర్న్ ఎకానమిస్టు" డిశెంబరు 29, 1950).

కాని, పరిశ్రమల శాఖామంత్రి హరికృష్ణ మెహతాబ్ 1951 ఏప్రియల్ 3 వ తేదీన పార్లమెంటులో మాట్లాడుతూ, "స్వతంత్రం" వచ్చిన తర్వాత గడిచిన మూడేండ్లలోనూ విదేశీయులు భాగస్వాములుగానున్న 88 పారిశ్రామిక సంస్థలను నిర్మించడానికి నిర్ణయం చేయబడింది. వీటి మొత్తం పెట్టుబడి 22.67 కోట్ల రూపాయలలోనూ 10.47 కోట్లు విదేశీ పెట్టు బడి అని తెలియజేశారు. దీనిపై యింకా ఎట్టి వివరాలూ లభ్యంగావడంలేదు. ఈ సంస్థల్లో వాస్తవంగా ఎన్ని నిర్మింప బడినాయో ఎవ్వరికీ తెలియదు.

కొద్ది సమాచారం మాత్రమే లభ్యమగుచున్నప్పటికీ, మరింత బ్రిటిషు పెట్టుబడి భారతదేశంలోనికి వస్తున్న ధోరణి మాత్రం వుంది.

## విదేశ పెట్టుబడుల పాత్ర

మన దేశపు ఆర్థిక జీవనంలో బ్రిటిష్ పెట్టుబడి, మును పటి లాగుననే, లోతుగా వేరూని వున్నదని మనం పైన

చూచాం. వుత్పత్తి, వర్తకం, రవాణా, గనులు, ద్రవ్య వ్యవహారాలు వగైరాలలోని మొత్తం పెట్టుబడిలో బ్రిటిష్ పెట్టుబడి గణించతగిన భాగంగా వున్నాయి.

ఇండియాలో పారిశ్రామికాభివృద్ధి అత్యల్పంగా నున్నది. జనాభాలోని చాలా తక్కువభాగానికి మాత్రమే పరిశ్రమల్లో పని దొరికింది. మనదేశపు ఆర్థిక జీవనంలో వ్యవసాయం తర్వాత వర్తకమే ప్రధానమైన వృత్తి. మనదేశపు విదేశ వ్యాపారం దాదాపు పూర్తిగా బ్రిటిష్ పెత్తనంలోనే వుంది.

రిజర్వుబ్యాంకు రిపోర్టు ప్రకారం మన విదేశ మారకాల్లో నూటికి 10 వంతులు మాత్రం రూపాయిలో జరుగుతున్నది. మిగతా 90 వంతులూ స్టెర్లింగ్ కంట్రోలులోనే, బ్రిటిష్ వ్యాపార కంపెనీల పెత్తనంలోనే వుంది.

900 నుండి 1000 కోట్లవరకు వున్న మన విదేశ వ్యాపారంలో భారత పెట్టుబడుల పాత్ర 100 కోట్లవరకు మాత్రమే. ఇది కూడా ఎక్కువగా పాకిస్తానుతోనే జరుగుతూంది. 1947 వరకు ఇది దేశీయ వ్యాపారంలో భాగమే.

మిగిలిన విదేశ వ్యాపారమంతా, వాల్కాట్ బ్రదర్స్, ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీస్, లీవర్ బ్రదర్స్, లూయీ డ్రెఫస్ వంటి ప్రపంచ విఖ్యాత బ్రిటిష్ గుత్త సంస్థల గుప్పెట్లో నున్నది.

ఈ వ్యాపారమంతా బ్రిటిష్, తదితర దేశ నౌకా కంపెనీల గుత్తగానే వుంది. మన నౌకలు, భారతదేశ సముద్ర తీర వ్యాపారానికి తప్ప, విదేశ వ్యాపారంలో పాల్గొనుటలేదు.

బ్యాంకులు, వడ్డీవ్యాపార విధానాలు తిరిగి బ్రిటిష్‌వాళ్ళ చేతుల్లోనే వున్నాయి. 1943 నుండి భారత బ్యాంకుల ఆర్థిక స్తోమతు, డిపాజిట్లు బాగా పెరిగినప్పటికీ, దేశానికి స్వతంత్రమైన ఆర్థిక విధానాన్ని రూపొందించుటలో అవి కించిత్తు పాత్రకూడా నెరవేర్చడంలేదు. పరిశ్రమల్లో దీర్ఘకాలిక పెట్టుబడులను పెట్టడంలేదు. రెండోవైపున మన విదేశ వ్యాపారానికంతా బ్రిటిష్ బ్యాంకులే ధనాన్ని సమకూర్చుతున్నాయి.

ఆ విధంగా మన ఆర్థిక విధానంలో బ్రిటిష్ పెట్టుబడియే ఆధిపత్యం వహించి, కంట్రోలుచేసి, చిత్తం వచ్చినట్లు నడిపిస్తూన్నది.

అయితే ఏమిటి? ఎవరి ప్రయోజనాలకోసం పాటు బడుతున్నది? మనం ఆర్థికముగా అభివృద్ధిగావడానికి బ్రిటిష్ పెట్టుబడి ఆదినుండీ సహాయం చేశాయా? ఈ ప్రశ్నలు రావడం సహజం. ఇవి చాలా ముఖ్యమైనవికూడ. అందువల్ల భారతదేశంలో బ్రిటిషు పెట్టుబడివహించిన పాత్రను పరిశీలించడం అవసరం.

"ఈ పెట్టుబడుల (పశ్చిమ యూరప్‌నుండీ, ముఖ్యంగా బ్రిటన్‌నుండి) ప్రవాహం, కోరినంత మేరకు సాంఘిక, ఆర్థిక అభ్యున్నతిని త్వరితగతిని సాధించడానికి తగినంతగా లేక పోవచ్చు. గాని ఈప్రాంతంలో గత వందసంవత్సరాలలోనూ జరిగిన అభివృద్ధికి పునాదినిమాత్రం చేకూర్చింది" అని, నవంబరు 28, 1950న భారతప్రభుత్వ ఆర్థికమంత్రి పార్లమెంటుకు సమర్పించిన కొలంబో ప్రణాళిక చెప్తున్నది.

మన దేశంలోని బ్రిటిషు పెట్టుబడులు మనకు లాభదాయకంగా, మన ఆర్థికాభ్యున్నతికి తోడ్పడేవిధంగా, వున్నాయనే భావాన్ని కలుగజేయడానికి కొలంబో ప్రణాళిక యత్నిస్తున్నది. భారతదేశాన్ని "అభివృద్ధిచేయడానికి" "మన ప్రజల జీవనస్థాయిని పెంపొందించడానికి" గాను మరింతగా పెట్టుబడులు|పెట్టవలసిందిగా బ్రిటన్, అమెరికాలను పండిట్ నెహ్రూ నాయకత్వానవున్న భారత ప్రభుత్వం ఆహ్వానిస్తున్నది.

పండిట్ నెహ్రూ అధ్యక్షతను రూపొందించబడిన పంచవర్ష ప్రణాళికకు ప్రధాన సూత్రాలను యీ కొలంబో ప్రణాళికయే యిచ్చిందని గుర్తు చేయడం అవసరం.

విదేశీ పెట్టుబడుల పాత్రనుగురించి, 1945 నవంబరులో నేషనల్ ప్లానింగ్ కమిషన్ చేసిన తీర్మానంలో యిలావుంది:

"బ్రిటిషు పరిపాలన నెలకొన్ననాటినుండే భారత వ్యవసాయం, ఖనిజ, పారిశ్రామిక సంస్థల్లో పెట్టబడిన విదేశీ పెట్టుబడులద్వారా, భారత ఆర్థిక, రాజకీయ జీవితంలో విదేశీ ప్రయోజనాలు కొంత మేరకు కంట్రోల్ సంపాదించడానికి వుపకరించాయి. ఇందువల్ల జాతీయాభివృద్ధి నిరోధించబడింది."

గత వందసంవత్సరాలుగా బ్రిటిషు పెట్టుబడులు మన దేశంలో వహించుతున్న పాత్ర ఒక్క ముహూర్తాన అమాంతంగా మార్పుచెందదు. 1947 ఆగస్టు వరకు బ్రిటిషు సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమానికి నాయకత్వం వహించామని చెప్పుకొని, యీనాడు బ్రిటిషు పెట్టుబడులను కాపాడ ప్రతిజ్ఞగైకొన్న పండిట్ నెహ్రూ, కాంగ్రెస్ నాయకత్వం మాత్రం మారిపోయారు.

బ్రిటిషు పెట్టుబడికూడా, యితర సామ్రాజ్యవాద పెట్టుబడుల వలెనే భారతదేశంలో చౌకగా ముడిపదార్థాలూ, చౌక మానవశక్తి వగైరాలు లభ్యమగునట్టి, పారిశ్రామికంగానున్న తమ దేశంలో లభ్యంగాని విపరీత లాభాలు గుంజడానికి తగినట్టి సారవంతమైన దేశం గావడంవల్లనే మన దేశానికి వచ్చింది.

బ్రిటిషు వర్తకం, వుత్పత్తి, నౌకావ్యాపారంపై బ్రిటన్‌కు 1913 లో భారతదేశంనుండి మొత్తం 280 లక్షల పౌనులు లాభం వచ్చిందని రజనీ పామీదత్తు అంచనావేశారు. అదే సంవత్సరంలో పెట్టుబడులపై మొత్తం లాభమూ, కప్పములు (Home Charges) చేరి దాదాపు 500 లక్షల పౌనులవరకూ వచ్చింది.

"1914 సంవత్సరం వచ్చేసరికి, పెట్టుబడులపై వచ్చే లాభాలు, వడ్డీ, ప్రత్యక్ష కప్పములు అన్నీ చేరి భారతదేశంలోని వర్తకం, వుత్పత్తి, నౌకావ్యాపారంలోని లాభాలరూపంలో ఇండియానుండిపోతున్న మొత్తం లాభాలను మించాయి." (నేటి భారతదేశం 1947).

1914-18 యుద్ధ, యుద్ధానంతరదశల్లోనూ ఈ క్రమం శరవేగమున జరిగిపోయింది. భారతదేశంలోని బ్రిటిషు పెట్టుబడులు దీక్షగా పెరుగుతూ వచ్చాయి. దానితోపాటే మన దేశాన్ని కొల్లగొట్టడంకూడా హెచ్చింది.

భారతదేశాన్నుండి ఏటా 220 కోట్ల రూపాయలు కొల్లగొట్టి తరలించుకొని పోబడుతున్నాయని 1921-22 లో

కె. టి. షా, కె. జె. ఖంబాటాలు అంచనావేశారు. ("భారత దేశపు సంపద, పన్నుల శక్తి" 1924).

1934 లో శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు యీ మొత్తం 161 కోట్ల రూపాయలని అంచనా వేశారు. "పింఛన్లు, కప్పములు వగైరాలక్రింద పంపిస్తున్న మొత్తాలు, భారతదేశంతో వ్యాపారసంబంధాలున్న బ్రిటిషేతరుల అప్పులకు గాను యిస్తున్న మొత్తాలు, దీనిలో చేర్చబడలేదు." కప్పములక్రింద మరో 20 కోట్ల రూపాయలు చేర్చవలసి వుంటుంది.

ఈ అంకె 180 కోట్లు వుంటుందని 1945 లో లారెన్స్, కె. రోజింగర్ అంచనా వేశారు.

ఈ దోపిడి యీనాడుకూడా కొనసాగుతూనేవుంది. రిజర్వుబ్యాంకు రిపోర్టుప్రకారం వడ్డీ, లాభాలక్రింద ఏటా 40 కోట్ల రూపాయలూ, భారతదేశ విదేశవ్యాపారంలో కమిషన్ రూపంలో 60 కోట్ల రూపాయలూ యివ్వడం జరుగుతున్నదని అంచనావేసింది. పింఛను రూపంలో యివ్వవలసిన 10 కోట్లు కూడా దీనితో చేర్చినట్లయితే సాలీనా మన దేశంనుండి 110 కోట్ల రూపాయలు తరలించుకొనిపోవడం జరుగుతున్నది.

ఇలా తగ్గుతున్నట్లుగా పైకి కనబడటమేగాని, అది యథార్థంగా తగ్గటంలేదు. ఇదివరకు వస్తున్న లాభాలకంటె (160 కోట్లు) తక్కువ వస్తున్నాయనిగాని, విదేశీ పెట్టుబడులు తరిగిపోయాయనిగాని దీని అర్థంగాదు. యుద్ధకాలంలో మన దేశంనుండి దోచుకొనిపోబడిన 1500 కోట్ల రూపాయలలోనూ (స్టెర్లింగ్ నిల్వలు) యుద్ధానంతరకాలంలో, రైల్వే ఖాతాను

బ్రిటన్‌కు యివ్వవలసిన బాకీక్రిందా, పింఛన్లక్రిందా చెల్లు వేయడం జరిగింది. (అంటే ప్రతి సంవత్సరం యిక్కడి నుండి రైల్వేలాభాలు, పింఛన్లనుతరలించుకొని పోతుండేవారు. యుద్ధానంతరం మనకు బ్రిటన్ యివ్వవలసిన బాకీలో నుండి యీ మొత్తాలను తగ్గించడం జరిగింది. అందువల్ల యిక్కడినుండి పోయేది తక్కువగానే కన్పించినా, అసలు మొత్తంమాత్రం ఏరూపంలో నైతేనేమి ఇంగ్లండు చేరుతూనే వుంది. —అనువాదకుడు)

అదీగాక యీ 110 కోట్లు తక్కువ అంచనాయే. పెట్టుబడులపై మామూలు లాభ రేటుగా 25% ను అంగీకరించి నప్పటికీ, ఒక్క పెట్టుబడులపై లాభమే షుమారు 100 కోట్లు వుంటుంది. కాని రిజర్వుబ్యాంకు రిపోర్టు చెపుతున్నట్లు 40 కోట్లు మాత్రంగాదు.

మన దేశంలోని బ్రిటిష్ పెట్టుబడి, మనను ముడి పదార్థాల సప్లైదార్లుగా, బ్రిటీషు సరుకులకు చక్కని మార్కెట్‌గా బ్రిటీషు పరిశ్రమకు అంటిపెట్టుకొని వుండేటట్లుగా తయారు చేసింది.

మన దేశంలోని ముడిపదార్థాలను గుంజుకోడానికి సాధ్యమగు పరిశ్రమలలోనే, రవాణా, వర్తకం మొదలైన వాటిలోనే బ్రిటీషు పెట్టుబడి కేంద్రీకరించింది. ముడి పదార్థాల ప్రాథమికోత్పత్తికోసం అవశ్యమగు పరిశ్రమల్లో మాత్రమే అత్యంత అల్ప మోతాదులలోనే బ్రిటీషు పెట్టుబడివుంది.

కాని మన ఆర్థిక స్వతంత్రానికి హామీగా వుండగల వివిధమైన భారీ పరిశ్రమలనూ మన దేశంలో బ్రిటన్ తనకు

తానుగా నెలకొల్పనూ లేదు; యితరులను నెలకొల్పనీయనూ లేదు. తన పరిశ్రమతో పోటీచేసి, తన పారిశ్రామిక పునాదిని ఎదిరించగలిగినట్టి, లేదా మనదేశం స్వతంత్రంగా నిలబడ నవకాశం కలిగించునట్టి, భారీ పరిశ్రమను ఎట్టిదానినీ లోగడగాని యిప్పుడుగాని నెలకొల్పనీయలేదు.

బ్రిటిషు పెట్టుబడికి యిష్టమున్నా లేకపోయినా మనదేశంలో కొన్ని సందర్భాలలో కొన్ని పరిశ్రమలు నెలకొన్నాయి. కాని ఇవిఅధీనదేశంగానున్న మనకూ, సామ్రాజ్య దేశంగానున్న బ్రిటన్‌కూ మధ్యగల సంబంధాలను మార్చలేకపోయాయి. మనదేశం ఎప్పటివలెనే ముడిపదార్థాల నందజేసి, బ్రిటిషు సరుకులకు మార్కెట్‌గానే వుపయోగపడుతున్నది.

మన దిగుమతులలో 17.8% ఆహారం, పొగాకు, పానీయాలు (ముఖ్యంగా ధాన్యం, అపరాలు వగైరా); 24.5% ముడి పదార్థాలకూ (ముఖ్యంగా ముడిప్రత్తి, ఖనిజ సంబంధమైన నూనెలూ, కలప); 56.8% తయారైన సరుకులకూ వినియోగ పడుతున్నది. పోగా, 15% మాత్రం యంత్రాలకోసం వినియోగింపబడుతున్నది. యీ యంత్రాలుకూడా యంత్ర పరికరాలనూ, వుత్పత్తి సాధనాలనూ వుత్పత్తి చేసేందుకు అవసరమగు భారీ యంత్రాలుగాదు. కొన్ని సరుకుల వుత్పత్తి కోసమో, అరిగిపోయిన వాటిని పునఃస్థాపించడంకోసమో వస్తున్నవే.

మన ఎగుమతి వ్యాపారంలో ఆహారం, పానీయాలు, పొగాకు (ముఖ్యంగా టీ వగైరా) క్రింద 21%: ముడి పదార్థాల క్రింద (ప్రధానంగా ముడి జనుము, ముడి ప్రత్తి, బొగ్గు,

నూనె విత్తులు, ముడిచర్మాలు, తోళ్ళు) 23.5%; జనపనార, ప్రత్తివస్తువులు, బాగుచేసిన చర్మాలు, తోళ్ళక్రింద 55% వుంది.

అత్యంతావశ్యకమగు అభ్రకము, ముడి మాంగనీసు, నూనె గింజలు వగైరా మనం యింకా ఎగుమతి చేస్తూనే వున్నాము.

ఆ విధంగా మనము ప్రధానంగా ముడి పదార్థాలను, కొద్దిగా సగంతయ్యారీ వస్తువులను మాత్రమే ఎగుమతి చేస్తున్నాము.

మనకు ఎట్టి మూలపరిశ్రమలూ లేవు. మన కున్న ఫ్యాక్టరీలు పనిచేయడానికి కావలసిన చిన్న చిన్న యంత్ర భాగాల కోసంకూడా పాశ్చాత్య విదేశీ మార్కెట్లపైననే ఆధార పడవలసి వున్నది. మన దేశపు బ్యాంకింగ్ అప్పుయంత్రాంగంపై బ్రిటిషు వారికి కంట్రోలువుంది. మన దేశం వెనకబడి యుండ డానికే యీ కంట్రోలు వినియోగించబడుతున్నది.

మన దేశంలో తమ పెట్టుబడులను పెట్టడానికి, వ్యాపారం ద్వారా, పరిశ్రమలద్వారా దోపిడి కొనసాగించటానికి మాత్రమే మన దేశాన్ని ఇంగ్లండు జయించలేదు.

పురాతన వ్యావసాయికవ్యవస్థనూ, పురాతన గ్రామీణ ఆర్థిక వ్యవస్థనూ (అది వెనుకబడియే వుండవచ్చు) నామ రూపాలు లేకుండా నాశనంచేశారు. కాని ఆ స్థానంలో ఏ కొత్త వ్యవస్థనూ నిర్మించలేదు. వారు, భూస్వాములనూ, వడ్డీ వ్యాపారులను సృష్టించారు; విపరీతమైన కౌలురేట్లు యిమ్మని రైతులను బలవంతంచేశారు. ఇంగ్లండులోని తమ పరిశ్రమలకు

ముడిపదార్థాలను సరఫరాచేయడానికిగాను, కొత్తగా తలెత్తు తున్న పెట్టుబడిదారీ మార్కెట్‌లో తాము పండించినదాన్ని చౌకగా అమ్మునట్లు రైతులను ఒత్తిడిచేశారు. ఈ భూస్వాములూ, వడ్డీవ్యాపారులూ, వారి సామ్రాజ్యవాద యజమానులూ ఏకమై భారత రైతాంగాన్ని గర్భదరిద్రులుగా చేశారు. అతను పండించిన ముడిపదార్థాలను వుత్పత్తి ధరకంటె తక్కువకే గుంజుకొనిపోయి, భారతదేశాన్ని కరువు కాటకాల నిలయంగా మార్చారు. ఆహారోత్పత్తి క్షీణించింది. సామ్రాజ్యవాద పరిశ్రమలకు చౌకగా ముడిపదార్థాలను సప్లయిచేసేలా మన దేశాన్ని తయారుచేశారు. దానితో "సిరిసంపదలతో తుల తూగుతున్న, భోగభాగ్యాల పుట్టినిల్లగు సుప్రభాభాసితయగు ఇంగ్లండును" సృష్టించడానికి పునాదియైన విపరీతమైన లాభాలను కూడబెట్టారు. భారతదేశంలోని వ్యవసాయాన్ని సర్వనాశనం చేసి ఇంగ్లండులో పరిశ్రమలు స్థాపించారు.

కాని బీదరికంలో మునుగుతున్న యీ భారత రైతు, మార్కెట్‌లోని బ్రిటిషు లేదా భారతీయ సరుకులను కొనడం నానాట తగ్గుతున్నది. అతని రక్తమాంసాలను పిండడానికి భూస్వాములనూ, వడ్డీ వ్యాపారులనూ నియమించిన పెట్టుబడిపైననే యీ దరిద్రం దుష్ఫలితాలు కలుగజేయ నారంభించింది. "వ్యావసాయిక అభివృద్ధి"; "భూస్వామ్య విధానాన్ని సంస్కరించడం లేదా రద్దుచేయడం", వడ్డీవ్యాపారుల కళ్లెలుబిగించడం వగైరా సమస్యలు ముందుకొచ్చాయి. రైతాంగ తిరుగుబాట్లు యీ సమస్యలను మరింత త్వరితం చేశాయి.

ఆ విధంగా మన దేశంలోని బ్రిటిషు పెట్టుబడులు మన దేశాన్ని ముడిపదార్థాల సరఫరాదారుగానూ, తమ తయ్యారీ సరుకుల మార్కెట్‌గానూ మాత్రమే వుంచాయి. వలస దేశంగా మార్చి, స్వతంత్ర ఆర్థికాభివృద్ధిని నిరోధించాయి. భారీపరిశ్రమల స్థాపనను అరికట్టాయి. మన వ్యావసాయికార్థిక వ్యవస్థను సర్వనాశనం చేశాయి. మన దేశంనుండి విపరీతమైన లాభాలను తరలించుకొనిపోయి రైతాంగాన్ని ఫ్యూడల్ దౌర్జన్యానికి గురిచేసి, మన దేశంలో పెట్టుబడులను పెంచుటనే అరికట్టి, సాంకేతిక విజ్ఞానం మన దేశంలో అభివృద్ధి గాకుండా నిరోధించాయి.

మన దేశంలోని వుత్పత్తి శక్తులకు స్వేచ్ఛ నివ్వడానికి మారుగా, వాటి అభివృద్ధిని బ్రిటిషుపెట్టుబడి కృత్రిమంగా అరికట్టింది. మన స్వతంత్రాభివృద్ధికే యిది పెద్ద గుదిబండగా పనిచేసింది. తత్ఫలితంగా మనం పురోభివృద్ధిని గాంచలేదు. అథోగతిపాలయ్యాం.

మన పారిశ్రామికాభివృద్ధి వెనుకబడిందని, భూమిపై వత్తిడి హెచ్చుతున్నదనీ, మన ఆర్థికవ్యవస్థ పాక్షికంగా నున్నదనీ, మన ఆహారోత్పత్తి పడిపోయినదనీ, సాగులోనున్న భూవిస్తీర్ణం తగ్గిపోతున్నదనీ, ఎకరం ఒకటింటికి పండే పంట రోజురోజుకూ క్షీణిస్తున్నదనీ, మన ప్రజల జీవన ప్రమాణం క్రమంగా పడిపోతున్నదనీ, ప్లానింగు కమిషన్‌తోసహా అందరూ అంగీకరించినదే.

బ్రిటిషు పెట్టుబడి, దోపిడులు మన దేశాన్ని, ప్రజలను బీదరికంలోకి లాక్కొచ్చాయి. మన ఆర్థిక వ్యవస్థ స్తంభించి

పోయేలా చేశాయి. ఒకనాడు కలిమితోనున్న భారతదేశ మీనాడు లేమితో కొట్టుమిట్టాడుతున్నది. విదేశ సహాయంతో మన ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచవచ్చుననీ, కొలంబో ప్రణాళిక దీనికి వుపకరిస్తుందనీ చెప్పేవారికి 1943 బెంగాల్ క్షామంలో అన్నార్తులై అసువులు బాసిన 35 లక్షల ప్రజల ఆర్తనాదాలే తిరుగులేని జవాబు.

అంతకుపూర్వం వలెనే నేడుకూడా మన పరిశ్రమలు విదేశాలనుండి దిగుమతియైన సరుకులపోటీనుండి మాత్రమే గాక, భారతదేశంలోనున్న బ్రిటిషు కంపెనీలు తయారుచేసిన సరుకుల పోటీనికూడా ఎదుర్కోవలసి వస్తున్నది. ప్రజావుసర పరిశ్రమలలోనికికూడా బ్రిటిషు పెట్టుబడి చేరి భారతీయ సరుకులతో పోటీకి వస్తున్నది.

ఉదా॥ "విదేశీ వుత్పత్తిదార్లనుండి తీవ్రమైన పోటీ రావడం యీ సంవత్సరపు (1949 నవంబరు-1950 అక్టోబరు) ప్రత్యేకత. ఈవిదేశీయులు తేలికగా దిగుమతి లైసెన్సులు పొందడంతో బాటు, భారతదేశంలోనే తమ వుత్పత్తి సంస్థలు నెలకొల్పుతున్నారు. దీనితో యిప్పటికేవున్న పోటీ మరింత తీవ్రమైంది. (రసాయనిక, పారిశ్రామిక, ఔషధ పరిశోధనా సంస్థల సాంవత్సరిక నివేదిక).

యుద్ధకాలంలో లేచిన పరిశ్రమలలో చాలా భాగం నాశనమౌతున్నాయి. ఇంజనీరింగు, సబ్బులు, టాయ్‌లెట్ పరిశ్రమ, డజన్లకొద్ది యితర పరిశ్రమలూ తుడిచి పెట్టుకు పోతున్నాయి,

# కాంగ్రెసు ప్రభుత్వ విధానం.

భారత దేశంలో విదేశీ పెట్టుబడియొక్క పాత్రను గుర్తించిన భారత విముక్తి వుద్యమం ఎల్లప్పుడూ, మన స్వతంత్ర పోరాటంలో, మన దేశంపై బ్రిటిష్ ఆర్థిక పట్టును రద్దుచేయడమనే కీలక సమస్యగా వుంటుందని అంచనా వేస్తూవచ్చింది. సంపూర్ణ స్వతంత్రనినాదంలో, భారత దేశంలో నున్న బ్రిటిష్ పెట్టుబడులను వశపర్చుకోవడమనే హంశం అత్యంత ప్రాముఖ్యమైనదిగా వుంటూనేవచ్చింది.

బ్రిటిష్ పెట్టుబడులను వశపర్చుకొనకుండా, మన ఆర్థిక వ్యవస్థపై వారి ధృతరాష్ట్ర కౌగిలిని తప్పించకుండా, వారి దోపిడిని, పీడనను అంతమొందించకుండా, మనం వాస్తవంగా స్వతంత్రులము కాలేము; బ్రిటిషు పెట్టుబడులు మనకు తగిలించిన సంకెళ్ళను బ్రద్దలు చేయనిదే, మన ఆర్థిక స్వతంత్రానికీ, సౌభాగ్యానికీ, మన ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడానికీ కీలకమైన భారీయంత్ర నిర్మాణ పరిశ్రమలను స్థాపించలేము.

పండిట్ నెహ్రూ అధ్యక్షుడుగానున్న నేషనల్ ప్లానింగ్ కమిషన్ 1945 సంవత్సరం నవంబరు 12వ తేదీన ఆమోదించిన తీర్మానంలో యిలా చెప్పింది:

"అట్టి పెట్టుబడులు (విదేశీ ఆర్థిక ప్రయోజనాలు), స్టెర్లింగ్ పెట్టుబడులుగల కంపెనీలకు సంబంధించి యున్నప్పుడు, వాటికి యివ్వవలసిన నష్టపరిహారాన్ని, ఇంగ్లండులోనున్న భారత స్టెర్లింగ్ నిల్వలద్వారా చెల్లించాలి."

1947 లో ప్రొఫెసర్ కె. టి. షా యిలా అన్నారు :
"ఈ సంస్థలను, కేంద్ర, రాష్ట్రీయ ప్రభుత్వాలు సాధ్యమైనంత త్వరలో, అవుసరమనుకున్నప్పుడు, వశపర్చుకోవాలి."

బ్రిటిషు పెట్టుబడిలో అత్యధికభాగం మన ప్రజలనుండి కొల్లగొట్టి దోచుకొనబడిన సొమ్ము. దీనిపై గత వందసంవత్సరాల్లోనూ, వడ్డీ, లాభాలు యితర విధాలుగాను వేల కోట్ల రూపాయలు భారతదేశంనుండి తరలించుకొనిపోవుట జరిగింది. అందువల్లనే బ్రిటిషు పెట్టుబడినంతా వశపర్చుకోవాలని జాతీయోద్యమంలోని అతివాదశక్తులు పట్టుబడుతూ వచ్చాయి.

"భారతదేశ విప్లవపు ప్రస్తుత దశలో, బ్రిటిషుఫ్యాక్టరీలు, బ్యాంకులు, రైల్వేలు, నది, సముద్ర రవాణా, తోటలువగైరా వశపర్చుకొని జాతీయంచేయడం ప్రధాన లక్ష్యంగా వుంటుంది" అని భారత కమ్యూనిస్టుపార్టీయొక్క కార్యాచరణ సంఘం 1929 లో ప్రకటించింది.

1947 లో అధికార మార్పిడి జరిగిన తర్వాత, భారత దేశం స్వతంత్రమైనదనీ, బ్రిటిషుపరిపాలన అంతమైనదనీ, పండిట్ నెహ్రూ, తదితర కాంగ్రెస్ నాయకులు ప్రకటించినపుడు భారత ప్రజలు ఎంతో ఆశించారు. మనం ఆర్థికాభ్యున్నతిని సాధించగలమనీ, మన బీదరికమూ, దైన్యమూ అంతమౌతాయనీ, దీనికి నాందిగా భారతప్రభుత్వం దేశంలోని బ్రిటిషు పెట్టుబడులను వశపర్చుకొని బ్రిటిషుపెట్టుబడిదార్ల దోపిడీని, పట్టును అంతం చేస్తుందని ఆశించడం జరిగింది.

కాని వాస్తవంగా కాంగ్రెస్ ప్రభుత్వంచేసిన దేమిటి ? అది తన వాగ్దానానుగుణ్యంగా ప్రవర్తించిందా? భారతదేశంలోని

బ్రిటిషు పెట్టుబడులను వశపర్చుకున్నదా? బ్రిటిషు ఆర్థిక పెత్తనాన్ని బలహీనపర్చడానికి అవసరమైన చర్యలు తీసుకున్నదా?

1946 లో పండిట్ నెహ్రూ నాయకత్వాన తాత్కాలిక మంత్రివర్గం ఏర్పడిన నెలలోగానే కె. సి. నియోగి అధ్యక్షతన అడ్వైజరీ ప్లానింగ్ బోర్డును నియమించారు.

ఈ సలహాసంఘం, ప్రత్యేక నైపుణ్యంగల పరిశ్రమల విషయంలో, కొంత అనుపాతంలలో విదేశీపెట్టుబడిని వుంచడం అవసరమేనని చెపుతూ "యిది మినహా భారతీయ పారిశ్రామిక రంగంలోనికి విదేశీ ప్రవేశాన్ని అనుమతించరాదని మేము అభిప్రాయపడుతున్నాము" అని బాహాటంగా చెప్పారు.

ఆ రిపోర్టులో యింకా యిలావుంది:

"ఇప్పుడు వుత్పత్తి చేయలేకపోయినా రేపైనా వుత్పత్తి చేయనవకాశమున్న వస్తువుల విషయంలో వాటి వుత్పత్తి కోసమై మన దేశంలోనే విదేశీ సంస్థలను నెలకొల్పి వ్యాప్తం చేసేకంటే ఆ వస్తువులను యితర దేశాలనుండి దిగుమతి చేసుకోవడాన్నే మేము సిఫార్సు చేస్తున్నాము. కాలక్రమేణా విదేశ దిగుమతులను తగ్గించవచ్చు; లేదా నిలిపివేయవచ్చు. కాని ఒకసారి వేరూనిన విదేశీ ప్రయోజనాలను తొలగించడం కష్టసాధ్యం".

## విదేశీ పెట్టుబడికి స్వాగతం

ఈ రిపోర్టు బుట్టదాఖలు చేయబడింది. కాని 1947 లో 'అధికార మార్పిడి' జరిగిన తర్వాత, విదేశీపెట్టుబడికి హామీల నిస్తూ కాంగ్రెస నేతలూ, ప్రభుత్వాధిపతులూ ప్రకటనల వర్షం కురిపించారు.

విదేశీ పెట్టుబడులపట్ల ప్రభుత్వ దృక్పథాన్ని వివరిస్తూ 1948 ఏప్రిల్ 6వ తేదీన ప్రభుత్వం పారిశ్రామిక విధానమును ప్రకటించింది. పండిట్ నెహ్రూ, 1949 ఏప్రిల్ 6 వ తేదీన పార్లమెంటులో మాట్లాడుతూ ఈ విధానాన్ని వివరించారు. ఆ విధానపు ప్రధానలక్ష్యాలు యివి :

అ. పారిశ్రామిక విధానాన్ని అమలు పర్చడంలో స్వదేశీ, విదేశీ సంస్థలమధ్య విచక్షణ చూపబడదు.

ఆ. లాభాలు తరలించుకొని పోవడానికీ, పెట్టుబడినే వుపసంహరించుకోడానికీ సక్రమమైన సౌకర్యాలు కలుగజేయబడతాయి.

ఇ. జాతీయం చేయడం జరిగితే న్యాయమైన, సవ్యమైన నష్టపరిహారం యివ్వబడుతుంది.

1949 ఏప్రియల్‌లో జరిగిన కేంద్ర పారిశ్రామిక సలహా సంఘపు రెండవ సమావేశం యీ క్రింది సిఫార్సులు చేసింది:

"ప్రభుత్వ స్థాయిలోగాని, మరి యితర విధంగాగాని, అమెరికా తదితర విదేశీ పెట్టుబడులు దేశంలోకి రావడాన్ని ప్రోత్సహించాలి" (భారత ప్రభుత్వ ఆర్థిక సలహాదారు 1950 జులైలో జారీచేసిన "భారతదేశంలో పెట్టుబడులకు సంబంధించి ప్రభుత్వం జారీచేసిన చర్యలు".)

పండిట్ నెహ్రూ అమెరికాచూడబోయినపుడు జాతీయ, విదేశీ వ్యాపార సంఘం, అమెరికా దూరప్రాచ్య వాణిజ్య పరిశ్రమల సంఘ సమావేశంలో ప్రసంగిస్తూ "భారతదేశం విదేశ పెట్టుబడిని ఆహ్వానిస్తుంది. లాభాలు, పెట్టుబడికి రక్షణ అనే షరతులపైననే, విదేశీపెట్టుబడి భారతదేశంలోనికివస్తుందని భారతదేశం గుర్తిస్తున్నది." (పై పుస్తకంలోనుండే)

అప్పుడు ఆర్థికమంత్రిగా నుండిన డాక్టర్ జాన్ మత్తయ్ 1950-51 సంవత్సర బడ్జెటును పార్లమెంటుకు సమర్పిస్తూ ఇలా అన్నారు:

"మనదేశంలో విదేశీ పెట్టుబడులు అవసరమనే నేను అనుకుంటున్నా. విదేశ పెట్టుబడులు అభివృద్ధిచెందిన దేశాల నుండి వెనుకబడ్డ దేశాలకు తరలిన 19వ శతాబ్దంలో ఆ పెట్టుబడులకు రాజకీయాధికారమే రక్షణగా వుండేది. మరో మాటల్లో చెప్పాలంటే విదేశీ పెట్టుబడిదార్లకు వలస విధానం అవుసరమైన గ్యారంటీగా వున్నది."

"అయితే యీనాడు వలస విధానం అంతర్ధానమైంది గనుక, అట్టి హామీని మనం స్నేహపూర్వక ఒప్పందాల ద్వారా యివ్వడం ఒక్కటే మార్గం" (అంటే మనదేశాన్ని వారు దోచుకోడానికీ, కొల్లగొట్టడానికీ, మనమే ఐచ్ఛికమైన అంగీకారాన్ని తెలపాలి).

అంతకుపూర్వం అసోసియేటెడ్ ఛేంబర్ ఆఫ్ కామర్సు (భారతదేశంలోని బ్రిటిష్ బడా వర్తకులు) సమావేశంలో ప్రసంగిస్తూ ఆయన యిలా హామీయిచ్చారు:

"భారతదేశంలోని బ్రిటిష్ ప్రయోజనాలకు నష్టం వాటిల్లే ఎట్టి చర్యనూ తీసుకునే వుద్దేశ్యం మాకులేదు. పైగా మీకు ప్రాతినిధ్యం వహిస్తున్న ఆ పెట్టుబడులు యిక్కడనే వుండి అభివృద్ధిగావడం మాకెంతో ఆనందదాయకం."

విదేశీ సంస్థలపై భారతీయులకు గట్టి కంట్రోలు, భాగస్వామ్యం వుండాలనే షరతుకూడా నీరుగార్చబడింది. నెహ్రూ అమెరికా వెళ్ళడానికి ముందుగానే భారతీయ వాణిజ్య, పారి

శ్రామిక సంస్థల ఫెడరేషన్ సమర్పించిన ఒక మెమోరాండానికి సమాధానమిస్తూ భారతప్రభుత్వం నిష్కర్షగా ఇలా చెప్పింది:

"విదేశీపెట్టుబడి దేశంలోనికివచ్చి పారిశ్రామిక రంగంలో స్వేచ్ఛగా వ్యవహరించడానికి అనుమతించడమే భారత ప్రభుత్వ విధానం. భారతీయేతర పెట్టుబడులలో అధిక భాగం వారి హక్కుభుక్తాలలోనూ, పూర్తికంట్రోలులోనూ వుంచడానికి భారతప్రభుత్వం విస్పష్టంగా అనుమతించింది. ఇందువల్ల దేశ ప్రయోజనాలకు హాని కలుగుతుందని ఎంచరాదు.

"మిగతా విషయాలు ఎలావున్నా, పరిశ్రమలు రూపొందుతున్న యీ దశలో భారతీయులే మెజారిటీగా వుండాలని భారత ప్రభుత్వం పట్టుపట్టబోవడంలేదు". ('హిందూ' 19-9-1949)

'ఎలైయన్స్' అనే అమెరికా పత్రికకు 21-8-49 న యిచ్చిన ఇంటర్వ్యూలో పండిట్ నెహ్రూ యింకో హామీ కూడా యిచ్చారు. ఆయన యిలా అన్నారు:

"ఒక పరిశ్రమకు రక్షణ యిచ్చినప్పుడు ఆ పరిశ్రమలోని భారతీయ, భారతీయేతర సంస్థలన్నీ ఆ సౌకర్యాలను కోరడానికి హక్కున్నది."

ఆ విధంగా, కాంగ్రెస్ ప్రభుత్వం అధికారాన్ని స్వీకరించిన దగ్గరనుండీ, బ్రిటిష్ పెట్టుబడిని వశపర్చుకొని, వారి ధృతరాష్ట్ర కౌగిలినుండి మన దేశాన్ని విముక్తి చేయడానికి బదులుగా, మరింతగా విదేశీపెట్టుబడిని ఆహ్వానిస్తున్నది. మన ప్రజలను దోచుకోడానికీ, మన ముడిపదార్థాలను కొల్లగొట్ట

డానికీ అవసరమైన సుంకరక్షణలతో బాటు వూహించ శక్యమైన హామీల నన్నిటినీ యిస్తున్నది.

ప్రస్తుత ప్రభుత్వం భారత జాతీయప్రయోజనాల రక్షకుడుగాగాక, బ్రిటిష్, తదితర విదేశీపెట్టుబడుల సంరక్షకుడుగా మారింది.

నామమాత్ర అధికార మార్పిడి జరిగినా భారతదేశం యింకా స్వతంత్రం కాలేదు; యింకా బ్రిటిష్ వలస దేశంగానే వుంది. ప్రస్తుత కాంగ్రెస్ ప్రభుత్వం తన విధానాలద్వారా, మన దేశంపైగల సామ్రాజ్యవాద పెత్తనాన్ని సుస్థిరం చేయడానికే సహాయం చేస్తున్నది.

పండిట్ నెహ్రూ ఒకప్పుడు యిలా అన్నారు :

"విదేశీ ప్రభుత్వస్థానాన్ని స్వదేశ ప్రభుత్వం తీసుకొనిన తర్వాతకూడా, విదేశీపెట్టుబడుల నన్నిటినీ అలాగే వుంచినట్లయితే, స్వతంత్రం ఛాయా మాత్రంగానైనా లేదనవచ్చు."

(జవహర్‌లాల్ నెహ్రూ, విదర్ ఇండియా?)

ఆ పండిట్ నెహ్రూయే విదేశీ పెట్టుబడులను అట్టిపెడుతున్న ప్రజా ప్రభుత్వానికి నేతగా వున్నాడు. ఆకాశం చిల్లులు బడేలా కేకలువేసిన స్వతంత్రం "ఛాయామాత్ర స్వతంత్రమైనా గాదు."

ఈ నాడు ఇరాన్‌వంటి చిన్నదేశాలుకూడా, తమను ఆర్థికంగానూ, రాజకీయంగానూ బానిసత్వంలోవుంచి ప్రజలను దారిద్ర్యానికి ఎరచేసిన, బ్రిటిష్ నూనె పెట్టుబడులను జాతీయం చేస్తున్నాయి. భారతదేశం ఎక్కడున్నది ?ఏం జేస్తున్నది ?

తాతలనాటి సామ్రాజ్య సౌకర్యాలను (బ్రిటిష్ సామ్రాజ్యవాద దేశాలకే హెచ్చు సౌకర్యాలను యిచ్చే విధానాన్ని (Imperial Preference System) భారతప్రభుత్వం యథారీతిని సాగనిస్తున్నది.

మరింత విదేశ పెట్టుబడిని ఎందు కాహ్వానిస్తున్నారు ?

"స్వతంత్ర" భారత ప్రభుత్వంచే ఆహ్వానించబడిన విదేశీ పెట్టుబడులు జాతీయ ప్రయోజనాలకు హాని కలిగించలేవని చెపుతున్నారు. మన స్వతంత్రంఎట్టిదో మనం పైననే చూచాం. సామ్రాజ్యవాదంతో పరీక్షైన భారత బడాపెట్టుబడిదారీవర్గ ప్రతినిధియగు యం. ఏ. మాష్టర్, విదేశ పెట్టుబడుల పాత్రను గురించి ఏమంటున్నాడో చూద్దాం. ఆయన 1946 లో యిలా అన్నారు :

"విదేశీ పెట్టుబడులు ఒక్క సుముహూర్తాన పరోపకార పరాయణులై, యికముందు భారతదేశంలోకి భారతదేశ విముక్తికోసమే వస్తాయనంటే దేశభక్తులైన భారతీయులు ఎవ్వరూ విశ్వసించలేరు."

("ఫ్రీ ప్రెస్ జర్నల్" 3-2-1946).

లాభాలు వస్తాయనే నమ్మకంలేనిదే ఏపారిశ్రామికవేత్తా, వ్యాపారీకూడా తమ ధనాన్ని పెట్టుబడి పెట్టరనేది సాధారణ విషయం. తమ దేశాలలో కంటె అనేకరెట్లు లాభాలు రానిదే, బ్రిటిష్, అమెరికన్ పెట్టుబడిదార్లు తమ ద్రవ్యాన్ని ఇండియా, తదితర వలస, అర్ధవలసదేశాల్లో వేలాదిమైళ్ళదూరాన ఎందుకు పెట్టుబడి పెడుతున్నారు? ఇతరదేశాల్లో పెడుతున్న పెట్టుబడుల వల్ల స్వదేశ పరిశ్రమలకు సహాయకారిగా నుంటాయేగాని,

వాటికి ప్రత్యామ్నాయంగా తయారు కాలేవని గుర్తించిన తర్వాతనేగదా పెట్టుబడులను పెడుతున్నది ?

కాని కాంగ్రెస్ నాయకులు వాస్తవానికి విరుద్ధమైన విషయాన్ని నమ్ముమంటున్నారు.

సరే, భారత జాతీయ ప్రయోజనాల దృష్ట్యానే, మనను స్వతంత్రులుగా చేయడాని కవసరమైన యంత్రనిర్మాణ పరిశ్రమలు నెలకొల్పడానికే, కాంగ్రెసు నాయకులు విదేశీపెట్టుబడులను ఆహ్వానిస్తున్నారేమో పరీక్షించుదాం.

సాంప్రదాయసిద్ధమైన మార్గాలద్వారా వస్తున్న బ్రిటిష్ పెట్టుబడిని అలావుంచండి. అమెరికా గుత్తసంస్థయైన అంతర్జాతీయ బ్యాంకునుండి 1947 నుండి 1950 జూన్ 30వరకు ఆరుకోట్ల యిరవైలక్షల డాలర్లు వచ్చింది. అయితే ఎవరి నుద్ధరించడానికి ?

అధికాహారోత్పత్తి వుద్యమం సందర్భంగా, కలుపుతీయడానికి కోటిడాలర్లు, రైల్వేయంత్రాలు కొనడానికి 4 కోట్ల 40 లక్షల డాలర్లు, దామోదర్‌లోయ ప్రాజెక్టుకు కోటీ ఎనభై లక్షల డాలర్లు ఖర్చుపెట్టబడ్డాయి.

ఇప్పుడు ఆహారాన్ని దిగుమతి చేసుకోడానికి 190 మిలియన్ల డాలర్లు అప్పుయిచ్చారు.

ప్రెశిడెంట్ ట్రూమన్ రూపొందించిన చతుస్సూత్ర ప్రణాళికను భారత ప్రభుత్వం హర్షించింది. ఈ ఒడంబడికల ప్రకారం అనేకమంది అమెరికన్ "సాంకేతిక నిపుణులు" అనేక తరహాలవారు వేంచేస్తారు. వారిని తీసుకుంటున్న దేశాలు "అత్యంత ప్రియతమ దేశ నిబంధనను" హామీ యివ్వాలి, లేదా అమెరికన్ పెట్టుబడులకు సమాన ఆదరణ యివ్వాలి.

వాటికి రక్షణా, లాభాలూ వగైరా గ్యారంటీ యివ్వాలి. అయితే యీ హామీలన్నీ భారత ప్రభుత్వం యిదివరకే యిచ్చింది.

మనం పంపమనికోరిన 88 మంది సాంకేతిక నిపుణుల లోనూ 32 మంది అప్పుడే దిగారు. ఈ "సహాయం" యొక్క, యీ సాంకేతిక నిపుణులయొక్క పరమార్థ మేమిటి ?

చతుస్సూత్ర ప్రణాళికయొక్క వుపయోగాన్ని అమెరికన్లకు విశదీకరిస్తూ, అచిసన్ అసలు విషయం కాస్తా బయట పెట్టేశాడు. తమకు కావలసిన ముడిపదార్థాలూ, సరుకులూ లభ్యమయ్యే నూతన సిక్షేపాలకు బాటలు తెరుస్తాయనీ, అమెరికన్ ఫ్యాక్టరీలు, సంస్థలు తయారుచేసిన సరుకులకు క్రొత్త మార్కెట్లుగా వుపయోగపడతాయనీ వెల్లడించాడు.

దేశమంతటా అలముకొన్న యీ 'సాంకేతిక నిపుణులు, బహిరంగంగానే మన జాతీయ సహజ సంపదలకు సంబంధించిన ఆర్థిక సమాచారాన్ని సేకరిస్తారు. అమెరికన్ ప్రైవేటు పెట్టు బడులద్వారా (Private investments) మన దేశాన్ని ఆర్థికంగా దోచుకోవడానికీ, రాజకీయ బానిసత్వంలో వుంచడానికీ వుపకరించే అమెరికన్ కార్యక్రమానికి కావలసిన సలహాలు, సహాయం చేస్తారన్నమాట యీ "నిపుణులు".

ఈ సహాయం మనదేశాన్ని "మన జాతీయ ప్రయోజనాలకోసంగాక, అమెరికన్ ప్రయోజనాలకోసం-అభివృద్ధి" చేయడానికి తోడ్పడుతుంది.

కొలంబో ప్రణాళికయొక్క వివరమైన రూపంగా దిద్దబడిన కాంగ్రెసు ప్రభుత్వ పంచవర్ష ప్రణాళిక 672 కోట్ల విదేశీ

పెట్టుబడిని ఆహ్వానించాలని ఆశిస్తున్నది. ఎందుకయ్యా? కొలంబో ప్రణాళిక యీ విషయాన్ని రహస్యంగా దాచడం లేదు. "ప్రపంచ వ్యాపారంలో యీ ప్రాంతంయొక్క కీలక స్థానాన్ని తిరిగి నెలకొల్పడమే" యీ 'దయార్ద్ర' సహాయం యొక్క లక్ష్యమని యీ ప్రణాళిక వివరిస్తున్నది.

"ప్రపంచ వ్యాపారంలో కీలకస్థాన" మంటే యుద్ధానికి పూర్వం యీ దేశాలలోవున్న పరిస్థితేనని యీ ప్రణాళిక వివరిస్తున్నది. ముడిపదార్థాల సప్లయిదార్లుగా, తయారైన సరుకుల కొనుగోలుదార్లుగా యీ దేశాలుండేవి. "ప్రపంచ వ్యాపిత వ్యాపారవిధానం" యిదే. ఈ పద్ధతి రెండో ప్రపంచ యుద్ధంవల్ల చెదరిపోయిందట. దీన్ని పునఃస్థాపించడమే ఈ ప్రణాళిక లక్ష్యం.

"ఈ ప్రణాళికక్రింద ఖర్చుపెట్టదలచిన మొత్తంలో నూటికి 10 వంతులు మాత్రమే పరిశ్రమలకు కేటాయించ బడుతుంది. భారత దేశంలో యింతకంటే తక్కువగానే పారి శ్రామికాభివృద్ధి ఆశించబడుతున్నది" అని ప్రణాళిక స్పష్టం చేస్తున్నది.

ముడిపదార్థాల సప్లైదార్లుగా, తయ్యారీ వస్తువుల కొనుగోలుదార్లుగానే, వలసస్థితిలోనే, మనను యింకా అట్టిపెట్టడానికి అమెరికా సహాయం యివ్వబడుతున్నది. అయితే కొలంబో ప్రణాళికవల్లనేమి, పంచవర్ష ప్రణాళికవల్లనేమి జరిగేమార్పు ఏమిటంటే అమెరికన్ పెట్టుబడి చొరబడడానికి ద్వారాలు తెరువబడుటయే.

మనకు సాంకేతిక విజ్ఞానంలేదనీ, దాన్ని ఆర్జించాలంటే విదేశీ పెట్టుబడిని తెచ్చుకోవాలని ప్రభుత్వం చెబుతున్నది. ఇదేమీ వివేకవంతమైన వాదనగా ఎవ్వరూ పరిగణించరు. అడ్వైజరీ ప్లానింగ్ బోర్డు, విదేశీ పెట్టుబడుల అవసరంలేదని చెపుతూ, యిలా అన్నది :

"అనేక పరిశ్రమలలో సహాయంచేయడానికి విదేశీ ఎక్స్‌పర్టులను తెచ్చుకోవడం అవసరమగును. కాని అట్టి ఎక్స్‌పర్టులు మామూలు వుద్యోగపరతులమీదనే లభ్యమౌతారనడం నిస్సందేహం".

మనకు ధనంకూడా లేదని చెపుతున్నారు. మరోసారి అడ్వైజరీ ప్లానింగ్ బోర్డు, బ్రిటిష్‌వారు మనకు "స్వతంత్రం" ప్రదానం చేయకపూర్వమే చెప్పిన దానిని వుదహరిస్తాను. ఆ రిపోర్టులో యిలా వుంది :

"అవసరమైన పెట్టుబడి యీ దేశంలోనే లభ్యం కాగలదనీ, పరిశ్రమల్లో ప్రత్యక్షంగా పెట్టుబడులు పెట్టడానికి విదేశీ పెట్టుబడి అవసరంలేదనీ ఉపసంఘాల పరిశీలన తెలుపుతున్నది."

"మేం యీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాం. సక్రమమైన ప్రోత్సాహం, రక్షణ యిచ్చినట్లయితే పారిశ్రామికాభివృద్ధికి కావలసిన పెట్టుబడి ప్రయివేటు పెట్టుబడిదార్లనుండే లభ్యం కాగలదు. అలా లభ్యం కానట్లయితే అది అంతగా అవసరమనుకున్నప్పుడు, వాంఛనీయమనుకుంటే ప్రభుత్వమే దాన్ని సేకరించవచ్చు."

భారతప్రజల బీదరికాన్ని అంతమొందించడానికి విదేశీ పెట్టుబడి సర్వరోగ నివారిణిగా చిత్రించబడుతున్నది. జీవన ప్రమాణంలో క్షీణత, సాంకేతిక విజ్ఞాన కొరత, పెట్టుబడి కూడకపోవడం, త్వరితగతిని బీటలువారుతున్న ఆర్థికవ్యవస్థ, భూమిపై హెచ్చుతున్న వత్తిడి-ఎక్కువగా విదేశీ సహాయాన్ని అర్థించడానికి యివన్నీ సాకులుగా చూపబడుతున్నాయి.

కాని భారతదేశం వెనుకబడివుండటానికీ, బీదరికానికీ కారణం "విదేశీ పెట్టుబడి కొరత" వల్ల గాదు; విదేశీ పెట్టుబడులు సాగించిన దోపిడికీ, పీడనకూ ప్రత్యక్ష ఫలితాలే.

స్వతంత్ర ఆర్థిక జీవనమును అభివృద్ధి చేయకపోవడం వల్లనే విజ్ఞానం, నైపుణ్యం కొరపడుట జరిగింది.

విదేశీపెట్టుబడి లేనందుననే దేశంలో పెట్టుబడికిలోటు ఏర్పడలేదు. విదేశీపెట్టుబడి దేశంలో కుప్పతెప్పలుగా చేరి మన ఆర్థిక స్వతంత్రాన్ని అభివృద్ధి చేయడంకోసంగాక మన ప్రజలను దోచుకోవడానికి వుపయోగపడినందుననే, పెట్టుబడి ప్రోగుకాకుండా విదేశాలకు తరలించుకొని పోబడినందుననే, భూమిపైనున్న ఫ్యూడల్ భూస్వాముల గుత్తపెత్తనం రైతాంగమును పేదరికంలో ముంచి సర్వనాశనంచేసి, యావత్తు ఆర్థిక వ్యవస్థనే ఛిన్నాభిన్నం చేసినందున దేశంలో పెట్టుబడి కూడుకొనలేదు.

దేశంలోని బ్రిటిష్ పెట్టుబడిని వశపర్చుకొని, భూస్వామ్య విధానాన్ని రద్దుచేసి, దున్నేవానికే భూమి యిచ్చిన తర్వాత యింకా పెట్టుబడి కావలసియున్నట్లయితే విదేశ పెట్టుబడిని ఆహ్వానించవచ్చు. కాని ఆ పెట్టుబడి మన జాతీయ ప్రయోజ

నాల కోసమే దేశంలోకి వస్తుంది. మన కెక్కడ అవసరమో అక్కడనే వినియోగిస్తాము. ఎక్కడ, ఏవిధంగా ఆ పెట్టుబడిని వుపయోగించాలో మనకు ఆ విదేశ ప్రభుత్వం ఆజ్ఞలు జారీ చేయలేదు. భారతదేశం అట్టి షరతులను వేటినీ అంగీకరించదు.

మనతో సమానహోదాలో స్నేహపూర్వక షరతులపై వర్తకంచేయ సిద్ధపడే ఏదేశంతోనైనా వర్తకం కొనసాగించడానికి భారతదేశం సంసిద్ధమే. మన పరిశ్రమలను, వ్యవసాయాన్ని నిర్మించుకొనుటలో యితర దేశాల సహాయం తీసుకుంటుంది. అయితే ఒక షరతుపైననే - అట్టి వ్యాపారమూ, సహాయమూ మనపై ఆధిపత్యం వహించరాదు. మన దేశాన్ని విదేశాలకు అధీనదేశంగా మార్చరాదు. అట్టి వ్యాపారానికీ, లేదా సహాయానికీ వుండే షరతులేవి ?

మనదేశ ప్రభుత్వం గుత్త ధనాధిపతుల, లాభాపేక్షాపరుల, భూస్వాముల చేతులలో వుండరాదనేది మొట్టమొదటి షరతు. అలా వారిచేతుల్లోనే వున్నట్లయితే సంకుచితమైన తమ ముఠాప్రయోజనాల కనుగుణ్యమైన వ్యాపారాన్నే సాగిస్తుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వం గనుక వున్నట్లయితే వ్యాపార విషయంలో మరో సూత్రాలను అనుసరిస్తుంది.

మనకు సహాయం చేయడానికీ, లేదా మనతో వ్యాపారం చేయడానికి సిద్ధంగానున్న దేశం, మనకు కావలసిన వస్తువులను సరఫరా చేయాలేగాని, తమ సంక్షోభాన్ని తగ్గించడానికి గాను వారు అమ్మాలనుకునేవిగాని, "వదలించుకొదలచినవి" గాని మననెత్తిన రుద్దరాదు. మన అవసరాలకు అనుగుణ్యంగా యంత్రాలూ, పరికరాలు, సప్లైచేయాలి; తమ పరిశ్రమలకు

ఎక్కడ "పోటీ" వస్తుందోనన్న భయంతో వాటిని త్రొక్కి పట్టరాదు.

న్యాయమైన ధరలకు సప్లయిలు యివ్వాలి.

ప్రస్తుతం మనము, సామ్రాజ్యవాద దేశంలోని గుత్తదార్లు నిర్దేశిస్తున్న ధరలకే సరుకులు తెచ్చుకుంటున్నాం. దానికి మారకంగా మన ముడిపదార్థాలను, యితర వస్తువులను కారుచౌకగా అమ్మవలసివస్తున్నది. మన దిగుమతులకు బదులు మనం ఎక్కువ వస్తువులనే పంపవలసి వస్తున్నది. మన దిగుమతుల విలువకంటె ఎక్కువ విలువనే ఇవ్వవలసివస్తున్నది. భూస్వామ్య విధానం మన రైతాంగాన్ని, కార్మికులను కొల్లగొడుతూ వాళ్ళ శ్రమకు చాల తక్కువ ప్రతిఫలం వచ్చేటట్లు చేస్తుంది. అందువల్ల సరకుల ఉత్పత్తి చౌకగా గిడుతుంది. ఈ ధరల మీదనే మనం ఎగుమతి చేస్తున్నాం. ఇదంతా మనదొక పరాధీన దేశం కావటంవల్ల జరుగుతూంది.

మన వ్యాపారం, స్వేచ్ఛాయుతమైన మార్కెట్‌లో, సమాన విలువల మారకంపై జరగడంలేదు. ప్రజాతంత్ర ప్రభుత్వమొక్కటే యీ విధానాన్ని అరికట్టగలదు.

మనకు లభ్యమైనంతవరకు మన నౌకల ద్వారానే వ్యాపారం జరగాలి. ఇంకా కొరత వున్నట్లయితే యితరుల నౌకలద్వారా జరగవచ్చు. మన బ్యాంకుల ద్వారానే ధనాన్ని సమకూర్చుకోవాలి. దీర్ఘకాలిక ఋణాలు విపరీతమైన వడ్డీలపై తీసుకోరాదు.

మన పరిశ్రమలను నెలకొల్పుకునే విషయం ఇతర దేశాల ...డి వచ్చే సాంకేతిక నిపుణులు, మన నిపుణులతో సమాన

హోదాలోనే పనిచేయాలి; నిర్ణీతకాలంలో మన దేశీయులను తర్ఫీదుచేసి, వెళ్ళిపోవాలి.

వర్కర్సు కమిటీలను, కార్మిక సంఘాలను గుర్తించాలి; సర్వతోముఖాభివృద్ధికి సహాయపడేలా జరుగుతున్న పనిని తనిఖీచేయడానికి వాటికి అనుమతి యివ్వాలి. విదేశ నిపుణులకు ఎట్టి ప్రత్యేక సౌకర్యాలూ, సదుపాయాలూ, మినహాయింపులూ వుండరాదు.

దిగుమతియైన విదేశీ పెట్టుబడి, నిర్ణీతకాలంలో, తన హక్కులను రద్దుచేసుకోవాలి; లాభాల్లో కొంతభాగం దేశంలోనే ఖర్చుపెట్టాలి, లేదా చెలామణిలో వుంచాలి. కొంత భాగం, మన రూపాయిల విలువలోనే ఎగుమతి చేసుకోవచ్చు.

మనకు సహాయం చేయాలనే తలంపువున్న ప్రజాతంత్ర దేశాలు మాత్రమే యీ హామీలను, షరతులను అంగీకరిస్తాయి గాని, మనను దోచుకొని బానిసత్వంలో వుంచాలని ఆశించే ఏ దేశమూ అంగీకరించదు. బ్రిటిష్, అమెరికన్ పెట్టుబడులుగాని, నిపుణులుగాని, మన పరిశ్రమలను అభివృద్ధి చేయగోరడంలేదనీ, మన మంచికోసంగాదనీ తేలిపోయింది. వారి యుద్ధ శకటానికి మనను బానిసలుగాచేసి కట్టివేయడానికే, తమ లాభాలకోసమే పెట్టుబడులు పెట్టాలనుకుంటున్నారు.

రష్యా, జకోస్లోవేకియా, తదితర దేశాల అనుభవం చూచినట్లయితే, వారు సమానహోదాలో వ్యాపారంచేయడానికీ, మనపరిశ్రమల నభివృద్ధి చేయడానికీ సిద్ధంగా వున్నారని బోధపడుతుంది. మనను బానిసలనుచేయ నుద్దేశించే యజమానులహక్కులను ఆ దేశాలు కోరడంలేదు, అందువల్ల నే

మన మంచికోసమే, ఆ దేశాలతో వ్యాపారం, పెట్టుబడి దిగుమతి సంబంధాలు అభివృద్ధిచేసుకోవడం ఆవశ్యకం.

గుత్త ధనాధిపతుల, ఫ్యూడల్ శక్తుల చేతులలోనున్న, బ్రిటిష్ పెట్టుబడికి బంధింపబడియున్న కాంగ్రెస్ ప్రభుత్వం రష్యా, చైనా మొదలైన దేశాలతో వ్యాపారం సాగిస్తున్నట్లు నటిస్తూ, అత్యల్పంగా మాత్రమే వ్యాపారం చేస్తున్నది. వాస్తవంగా ఆ దేశాలతో వ్యాపారాన్ని విధ్వంసంచేసి, కొద్దిమంది కుబేరుల లాభాలకోసమై బ్రిటన్ అమెరికాలతో మాత్రమే వ్యాపారాన్ని పెంపొందిస్తున్నది.

విదేశీ పెట్టుబడిని ప్రభుత్వం ఆహ్వానిస్తుండడం మన దేశాన్ని పారిశ్రామికం చేయడానికిగాదు. మనదేశాన్ని, మన నిక్షేపాలను, ప్రజలను కొల్లగొట్టి, మన ముడిపదార్థాలను తరలించుకొనిపోయి, తయారైన సరకులను గుమ్మరించడానికి, "యుద్ధపూర్వపు వ్యాపారసరళిని తిరిగి నెలకొల్పడం" కోసం, సకల సౌకర్యాలూ కల్పించి, వలసప్రయోజనాలుగల్గిన సామ్రాజ్యవాదుల మెప్పుబడయడానికే.

విదేశీ పెట్టుబడిదార్లకు సమానహక్కులనే గ్యారంటీ చేస్తున్నది. అయితే భారతీయ ధనాధిపతులకూ, బ్రిటిష్, అమెరికన్ పెట్టుబడిదార్లకూ సమానత్వమనేది వూహకైనా అందడంలేదు. భారతీయ గుత్తపెట్టుబడిదార్లగు సింధియాల పెట్టుబడి, బ్రిటిషు పెట్టుబడిముందు దివిటీముందు గుడ్డిదీపంగానే వుంది! "అత్యంతాదరణీయ దేశసిద్ధాంతం, లేదా సమానత్వానుసిద్ధాంతంయొక్క ఫలితం, మనదేశ వుత్పత్తిదార్లతో, పోటీచేసి

వారిని సర్వనాశనం చేయడానికి బ్రిటిషు, అమెరికన్ పెట్టుబడి దార్లకుస్వేచ్ఛనీయడమే.

స్వతంత్రమైన, స్వేచ్ఛాయుతమైన దేశాల మధ్యనే సమానత సాధ్యం. ఒక సామ్రాజ్యవాద దేశానికి, దాని అధీన దేశాలకూ మధ్య సమానత వుండడం వూహాతీతం. ప్రస్తుతం బ్రిటిష్ పెట్టుబడి పెత్తనంక్రింద అణగి మణగియున్న, బ్రిటిష్ పరిశ్రమలకు అనుబంధంగానున్న భారతదేశం, బ్రిటన్, అమెరికాలతో సమానహోదాలో నిలబడి మనదేశ ప్రయోజనాల కొరకై పెట్టుబడిని కొనితేజాలదు. అట్టి సమానతే వుండాలంటే మనం మొట్టమొదట, విదేశీ ఆర్థిక కౌగిలినుండి విముక్తి గాంచడానికి పోరాడాలి.

చైనా అనుభవం మన కళ్ళముందున్నది. చైనాను "అభివృద్ధిచేయడానికి"గాను అమెరికా ప్రభుత్వం చైనాలోకి దశాబ్దాలుగా, యీ "ఉదార" సహాయాన్ని, అనేక మిలియన్ డాలర్లను క్రుమ్మరించింది. అయితే యీ అమెరికన్ "సహాయపు" ప్రతి డాలర్‌తోనూ చైనాలో నోట్లముమ్మరం అధికమైంది; చైనా ఆర్థికవ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. విదేశీ సహాయాలన్నిటివలెనే, అమెరికా సహాయంకూడా, చైనా ఆర్థికాభివృద్ధిని ఆటంకపరచి, ఆఖరుకు కూలద్రోసింది.

## కీలక సమస్య

చైనా ఆర్థికాభివృద్ధిని అరికట్టిన సంకెళ్ళ నన్నింటినీ బ్రద్దలుచేయడం ద్వారానే, జీవన ప్రమాణాన్ని పెంచడం, భారీ, మూల పరిశ్రమలను నెలకొల్ప పూనుకోవడం సాధ్య

మైంది. చైనా అభివృద్ధి అమెరికా సహాయంవల్ల జరిగిందిగాదు. ఆ సహాయాన్ని నిరాకరించడంవల్లనే, ప్రతికూలించడంవల్లనే చైనా అభివృద్ధి చెందింది.

అట్లే మనంకూడా, మన జాతీయార్థిక విధానాన్ని ఆటంకపరుస్తున్న సంకెళ్ళను త్రెంచడం ద్వారానే ఆర్థిక సౌభాగ్యాన్ని సాధించగలం. అందువల్లనే బ్రిటిష్ పెట్టుబడులను వశపర్చుకోవడమనే సమస్య మన ఆర్థిక విధానంలో కీలక సమస్యగా వుంటున్నది. మన స్వతంత్ర ఆర్థికాభ్యున్నతికి ఇదొక షరతు.

"ఇండియాలో బ్రిటిష్‌వాళ్ళ ఆధీనంలోవున్న అన్ని ఫ్యాక్టరీలను, బ్యాంకులను, తోటలను, వాణిజ్య నౌకల్ని, గనులను – అవి వారి పేరున వుండనీయండి, ఇండియా కంపెనీల పేరు పెట్టకోనీయండి – స్వాధీనంచేసుకొని, వాటిని జాతిపరం చేయడం", మన దేశం యదార్థంగా స్వతంత్రం గావడానికి అవుసరమని భారతకమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం భావిస్తున్నది.

భారతదేశంలోని బ్రిటిష్ పెట్టుబడులను వశపర్చుకోవడంతో, ప్రజాతంత్ర ప్రభుత్వం చేతులలోనికి అపరిమిత నిధులు (Resources) వస్తాయి.

ఏటా మనదేశంనుండి తరలించుకొనిపోతున్న వందకోట్ల రూపాయలకుపైగా నిలిచిపోతాయి. తద్వారా, పురోభివృద్ధికీ, పరిశ్రామికం చేయడానికీ, ముఖ్యంగా భారీ పరిశ్రమలను స్థాపించడానికీ కావలసిన ధనం లభ్యమౌతుంది.

అంటే, మన మొత్తం పెట్టుబడులలో అధికభాగంపై ముఖ్యమైన రంగాలలో, మన ఆర్థికవ్యవస్థయొక్క జీవనాడులలో

ప్రభుత్వ కంట్రోలు ఏర్పడుతుంది. తద్వారా భారతీయ పెట్టుబడిదార్ల కుయుక్తులను అరికట్టి దేశాన్ని ప్రణాళికా బద్ధమైన స్వతంత్ర ఆర్థికాభ్యున్నతి పథాన పురోగమింపజేయడానికి అవకాశం చిక్కుతుంది.

అన్నిటికంటే ముందుగా యీ చర్య మనను విదేశీ రాజకీయ దాస్యంనుండి విముక్తిచేసి, సర్వస్వతంత్రులనుగా చేస్తుంది.

## అనుబంధం 1

### స్వదేశీ, విదేశీ బ్యాంకులు

"భారతదేశంలోని బ్యాంకులకు సంబంధించిన లెక్కలు" అనే రిజర్వుబ్యాంకు రిపోర్టు (1950) ప్రకారం, స్వదేశీ, విదేశీ బ్యాంకుల పరిస్థితి యిలావుంది.

### 1950 లో డిపాజిట్లు

| | | |
|---|---|---|
| విదేశీ బ్యాంకులు | ... | 17,607 లక్షల రూ. |
| స్వదేశీ బ్యాంకులు | ... | 77,059 ,, |

దాదాపు శతాబ్దంగా వుంటూవచ్చిన పరిస్థితికి యిది భిన్నంగావుంది. 1943 వరకు మనదేశంలోని బ్యాంకింగ్, అప్పులు అన్నీ విదేశీబ్యాంకుల ముఖ్యంగా బ్రిటిష్‌బ్యాంకుల, కంట్రోల్ క్రిందనే వున్నాయి. భారతదేశంలోని బ్రిటిష్ బ్యాంకులలోని డిపాజిట్లు, భారతీయ జాయింటుస్టాక్ బ్యాంకుల లోని డిపాజిట్లకంటె అనేకరెట్లుగా వుంటూవుండేవి.

1943 లో ప్రప్రథమ పర్యాయం, యుద్ధకాలపు నోట్ల ముమ్మరం, భారతీయ బడా వ్యాపారుల, కంట్రాక్టర్లకు లభించిన అపరిమితమైన లాభాలవల్ల, భారతీయ బ్యాంకులలోని డిపాజిట్లు, విదేశీ బ్యాంకులలోని డిపాజిట్లకంటె నూటికి 1½ రెట్లు పెరిగాయి.

ఇప్పటికొచ్చేసరికి, విదేశీ బ్యాంకులలోని డిపాజిట్లకంటె భారతీయ బ్యాంకులలోని డిపాజిట్లు నాల్గురెట్లకుపైగానే వున్నాయి.

ఇంతమాత్రంచేత బ్రిటిష్ బ్యాంకులకంటె భారతీయ బ్యాంకులూ, పెట్టుబడీ, శక్తివంతమైనాయని భావమా?

ఇండియాలోని విదేశీ బ్యాంకులపాత్ర ఏమిటో అందరూ ఎరిగున్నదే. ఈ విదేశీబ్యాంకు లెల్లప్పుడూ బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలనకు ముఖ్య సాధనముగా, భారతదేశాన్ని పారిశ్రామికంగా వెనుకనే వుంచడానికి, భారతదేశంలోని వలస ఫ్యూడల్ వ్యవస్థను అట్లే వుంచడానికి శక్తివంతమైన సాధనంగా ఉపకరించాయి.

సూక్ష్మంగా పరీక్షించినట్లయితే నామమాత్ర మార్పులు టికీ విదేశీబ్యాంకుల పరిస్థితి ప్రత్యక్ష బ్రిటిష్ పాలనలో వుండిపోయింది.

1. భారీ, మూలపరిశ్రమలనుగాని, ఇంకే పరిశ్రమలను ంచడానికి తమవద్దనున్న డిపాజిట్లను భారతీయ బ్యాంకులు యోగించడంలేదు. భారత పరిశ్రమలలో యీ బ్యాంకులు క పెట్టుబడులు పెట్టడంలేదు. బ్రిటిష్ వలస పాలనవల్ల అసమానాభివృద్ధిని చక్క-జేయడానికి అవుసరమైన

మార్గాలలోనికి భారతీయ పెట్టుబడిని మరల్చడానికి సహాయం చేయుట లేదు.

భారతీయ జాయింట్ స్టాక్ బ్యాంకులలోవున్న మొత్తం పెట్టుబడులు 390.33 కోట్లలోనూ నూటికి 88 వంతులు ప్రభుత్వ సెక్యూరిటీలలోనే వున్నాయి.

పోగా మిగిలిన 50 కోట్లలో, 22 కోట్లు విదేశీ సెక్యూరిటీలలోనూ, మరో 7 కోట్లు యితర ట్రస్టీ సెక్యూరిటీలలోనూ వున్నాయి.

ఒక్క 14 కోట్లు మాత్రం "జాయింట్ స్టాక్ కంపెనీలలో వాటాలు, అప్పుల" రూపంలో వున్నాయి. అయితే యీ జాయింట్‌స్టాక్ కంపెనీలు విదేశీ కంపెనీలేనేమో తెలియదు!

2. మన ఆర్థిక రంగంలో మరో ప్రధాన భాగమైన విదేశీ వ్యాపారమంతా విదేశీ బ్యాంకుల గుత్తగానే వుంది. భారతీయ బ్యాంకులలోని డిపాజిట్లు, నిధులు ఎంతగానో పెరిగినప్పటికీ, శతాబ్దాలుగా గుత్తాధికారాన్ని చెలాయిస్తున్న బ్రిటిష్ విషసర్పాలతో పోరాడుటలో విఫలమైనాయి.

ఈ 15 విదేశీ బ్యాంకులు (పాకిస్తాన్ మినహా మారకపు బ్యాంకులని పిలవబడుతున్నాయి. వీటికి అన్ని కేంద్రాలలోనూ 66 శాఖలున్నాయి. వీటిలో 55 శాఖ[illegible] 5 లక్షలుపైగా జనాభా గల్గిన నగరాల్లోనే వున్నాయి. భా[illegible] దేశ దిగుమతి-ఎగుమతి వ్యాపారాన్ని యీ బా[illegible] నడుపుతున్నాయి.

సిలన్‌వంటి చిన్న దేశాల బ్యాంకులే విదేశాలలో అనేక మారకపు ఆఫీసులు తెరిచాయి. మన దేశంలోని కొద్దిబ్యాంకులు మాత్రమే యీ పనికి పూనుకొని సాహసించాయి. విదేశీ వ్యాపారంలో భారతీయబ్యాంకులకున్న పాత్ర పాకిస్తాన్‌కు సంబంధించినంతవరకే. ఇండియాయొక్క విదేశీ వ్యాపారం ద్వారా యీ మారకపు బ్యాంకులు ఏటా మన దేశాన్నుండి కమిషన్ రూపంలో 25-30 కోట్ల రూపాయలు తీసుకొని పోతున్నాయి.

3. భారతీయ షెడ్యూల్డు బ్యాంకులు 1950 లో యిచ్చిన అప్పులు, అడ్వాన్సులకు సంబంధించిన పరిస్థితి ఎలా వున్నదో పరిశీలిద్దాం. వాణిజ్యానికై 48% నుండి 52% వరకు పరిశ్రమలకై 32% నుండి 34% వరకు; వ్యవసాయానికై 2% నుండి 3% వరకు యివ్వబడ్డాయి.

ఇప్పుడున్న సంస్థలకు యిచ్చిన స్వల్పకాల అప్పులలో, నూటికి 43-46 వంతులు వ్యాపారంపైనా, 10%-11% ప్రభుత్వ సెక్యూరిటీలపైనా, 11% యితర స్టాక్ ఎక్స్ఛేంజిహామీలపైనా [illegible]న్నాయి. భారతీయ పెట్టుబడి యీ రంగంలో తన పాత్రను [illegible]ంచడం నిస్సందేహం. అయితే యిక్కడకూడా రిపోర్టులో [illegible]న్నప్రకారం, 1949 తో పోల్చినట్లయితే 1950 లో [illegible] పెరుగుదలలో విదేశీబ్యాంకులవాటా (14 కోట్లు) దేశీయ [illegible]బ్యాంకులవాటా 7 (కోట్ల)కన్న అధికమే."

4. మన దేశంలోని, అల్హాబాద్ బ్యాంకు, అన్నిటికన్న [illegible] ఇంపీరియల్ బ్యాంకువంటి శక్తిసంపన్నమైన బ్యాంకులు [illegible]టోలులో వున్నాయనేది మర్చిపోరాదు.

అందువల్ల భారతీయ జాయింటు స్టాక్ బ్యాంకులయొక్క నిధులు విస్తృతమైనంతమాత్రాన భారతీయ బ్యాంకులశక్తి పెరిగిందనుకోరాదు.

## అనుబంధం - 2

### నూనె గుత్తాధికారులతో ఒడంబడిక

భారత ప్రభుత్వం, నూనె శుద్ధి కర్మాగారాలను నెలకొల్పడానికిగాను, స్టాండర్డు వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (అమెరికా) తో ఒకటి; బర్మాషెల్ (బ్రిటిష్)తో మరొకటి, మొత్తం రెండు ఒడంబడికలు కుదుర్చుకున్నది. కాల్టెక్స్‌తో ఒడంబడికకు సన్నాహాలు జరుగుతున్నాయి. డిసెంబరు ఆఖరులో సంభాషణలు ప్రారంభమౌతాయి. ఈ మూడు ఒడంబడికల ద్వారా, అత్యంత శక్తివంతమైన గుత్తసంస్థలద్వారా మన దేశంలోనికి మరో 60 కోట్లరూపాయిలు బ్రిటిష్, అమెరికన్ పెట్టుబడి కొత్తగా ప్రవేశిస్తుంది.

ఈ ఒడంబడికలు "మన ఘనవిజయంగా" పత్రికలు ఆకాశాని కెత్తుతున్నాయి. "నూనె శుద్ధి కర్మాగారాలు మన దేశపు హద్దులోకి రావడంతో, యుద్ధపురోజులలోగాని, దినాలలోగాని, అత్యంతావశ్యకమగు ఒక కీలకపదార్థాయిల విషయంలో భారదేశ పరిస్థితి బలపడినందుకు" నందరినీ "సంతోషించ" మంటున్నది.

(బిర్లాగారి హిందూస్తాన్ టైమ్సు డిశెంబరు 4

అయితే వాస్తవమేమిటి? ఈ ఒడంబడికలు ఏమి జేస్తాయి ? ఒడంబడికయొక్క షరతులనే చూడండి:

స్టాండర్డ్ వాక్యూమ్ ఆయిల్ కంపెనీతో నవంబరు 30, 1951 న ఒడంబడిక కుదుర్చుకోబడింది. ఈ ఒడంబడిక ప్రకారం యీ కంపెనీ, 3 కోట్ల 50 లక్షల డాలర్లతో (రూపాయిల లోనికి మార్చి) తనశాఖను ఒకదాన్ని ప్రారంభించి, బొంబా యిలో నూనెశుద్ధి కర్మాగారాన్ని నిర్మిస్తుంది. దీనిలో నాలుగవ వంతు షేర్లు భారతీయులకు క్యుమిలేటివ్ ప్రిఫరెన్స్ షేర్ల రూపంలో యివ్వబడతాయి. "వారికి ఓటుచేసే హక్కుండదు. ఇందులోని సాధారణ వాటాలన్నీ న్యూయార్కులోని స్టాండర్డ్ వాక్యూమ్ ఆయిల్ కంపెనీ క్రిందనే వుంటాయి."

("కామర్సు" డిసెంబరు 8)

"సాధారణ పెట్టుబడిలో (Ordinary Capital) యీ దేశీయులకు భాగంలేకుండా చేసినట్లే, సాధారణ డివిడెండ్లుగా పంచిపెట్టబడే లాభంకూడా వీరికి యివ్వకుండా ఆపుచేయ బడుతుంది."

("హిందూస్థాన్ టైమ్సు" డిసెంబరు 4)

"దీని యాజమాన్యంలోగాని, ఆధిపత్యంలోగాని భార (Voice) హక్కుండదు". ("కామర్సు")

ఈ కంపెనీని 25 సంవత్సరాలవవరకూ జాతీయం చేయ మనీ, సావంత్సరిక లాభాలు తీసుకొనిపోవడానికీ, జాతీయం అయితే పెట్టుబడినే తరలించుకొనిపోవడానికీ సకల సౌక ర్యస్తామనీ భారతప్రభుత్వం హామీనిచ్చింది. ఈ సంస్థ ప్రారంభించిన నాటినుండి 10 సంవత్సరాలవరకు

సుంకాలనుండి రక్షణ యివ్వడానికి, ఆ తర్వాతకూడా ఈ విషయాన్ని టారిఫ్ కమిషన్‌కు వదలివేయడానికి నిర్ణయించింది.

ముడి నూనెను దిగుమతి చేసుకోడానికీ, శుద్ధిచేయబడిన నూనె దేశంలో పంచగావున్న "మిగులును" విదేశాలకు ఎగుమతి చేయడానికీ కావలసిన ఏర్పాట్లన్నీ కంపెనీయే చేసుకుంటుంది. క్రొత్తగా ప్యాసైన పరిశ్రమల (అభివృద్ధి, తనిఖీ) చట్టంలోని కొన్ని షరతులు యీ కంపెనీకి వర్తించరాదని ప్రభుత్వం నిర్ణయించింది. మినహాయించబడిన యీ షరతులేవి? కంపెనీ వ్యవహారాలలో ప్రభుత్వజోక్యం కల్పించుకొనుట, కొన్ని సందర్భాలలో కంపెనీల కంట్రోలు, యాజమాన్యాన్ని సైతం తీసుకొనే హక్కు ప్రభుత్వానికుండుట, అనే షరతులు మినహాయించబడినాయని భారతదేశంలోని వ్యాపారవర్గం ఆరోపిస్తున్నది. ఈ చట్టం పార్లమెంటులో అంగీకరించబడినదో, లేదో కాని, ప్రభుత్వం యీ మినహాయింపులు చేసింది.

పన్ను లేకుండానే ముడినూనె దిగుమతి చేసుకోడానికీ, కంపెనీకి కావలసిన భూమిని సంపాదించుకోడానికీ, టాంకర్ల రాకపోకలకూ, రేవులనుండి ముడినూనె కర్మాగారా[...] రవాణా చేయడానికీ, సహాయంచేయడానికి భారత[...] అంగీకరించింది.

ట్రాంబేవివద్ద భూమిని తీసుకోవాలనే[...] వున్నట్లు బొంబాయి ప్రభుత్వ గెజెట్ ప్రకటన చేసింది.

తన యంత్రాలను, ప్లాంటులను తక్కువ సుంకాల[...] $5\frac{1}{2}\%$ కే దిగుమతి చేసుకోడానికి కంపెనీకి అనుమ[...] బడింది. శుద్ధికర్మాగారానికి కావలసినఉక్కు రేకులు,[...]

దిగుమతి చేసుకొనుటకు కావలసిన ఏర్పాట్లను స్వంతంగా కంపెనీయే చేసుకుంటుంది. అట్టి దిగుమతులకు భారత ప్రభుత్వం సకల సౌకర్యాలూ కలుగజేస్తుంది.

ఇన్ని హామీలు యిస్తే కంపెనీ చేసేదేమిటంటే "యీ కర్మాగారాన్ని సాధ్యమైనంత త్వరలో పూర్తిచేయడానికి" దయతో అంగీకరించింది. లభ్యమైనపుడు భారతీయ మద్దీనూ నె వుపయోగించడానికి, తగిన భారతీయులు ఎక్కడైనా లభ్యమైతే వుద్యోగాలీయడానికీ తరిఫీదు చేయడానికీ సమ్మతించారు.

సాలీనా 10 లక్షల టన్నులు ఉత్పత్తిచేయగల యీ అమెరికన్ కంపెనీతోబాటు 15 లక్షల టన్నులు వుత్పత్తిచేయగల శుద్ధికర్మాగారాన్ని బర్మాషెల్ ప్రారంభిస్తుంది. బర్మాషెల్ కూడా 22 కోట్లతో మరోసంస్థను స్థాపించి, దానిలో 2 కోట్ల రూపాయల వాటాలు భారతీయులకు యిస్తుంది. ఇవికూడా "క్యుమిలేటివ్ ప్రిఫరెన్సు షేరు"లే. డిశెంబరు 15 న సంతకాలు జరిగిన యీ ఒడంబడికలో కూడా, స్టాండర్డ్ వాక్యూమ్ ఆయిల్ కంపెనీతో చేసుకున్న ఒడంబడికకీ షరతులేవున్నాయి.

ప్రపంచంలోని గుత్తేదార్లు నిర్ణయించిన ధరలకంటె ...రలకు అమ్మవలెనని భారత ప్రభుత్వం ఏదశలోనూ ...నికి ఆస్కారం లేదు. కాబట్టి యిక్కడ తయారైన ...కూడా చౌకగా లభ్యంగాదన్నమాట.

కనీసం 40% లాభాలరేటు వేసుకున్నప్పటికీ, ఈ కంపె...గా మన దేశంనుండి 25 కోట్ల రూపాయలు తరలించు...నికి యీ ఒడంబడికలు అవకాశమిస్తున్నాయి.

మనకుమాత్రం గుడ్డిగవ్వ యివ్వరు; లభ్యమైనపుడు మన దేశపు ముడ్డినూనెను వుపయోగించడానికీ, తగిన భారతీయులు లభ్యమైనపుడు వారికి వుద్యోగాలిచ్చి "తరఫీదు చేయడానికీ" సమ్మతించడం మినహా. వీటికితోడు వివిధ సుంకాలు, రక్షణ సౌకర్యాలవల్ల కంపెనీలకు మరింత లాభాలే చేకూరతాయి.

విదేశీ పెట్టుబడులకు పూర్తిగా లొంగిపోవడాన్నే, బ్రిటిష్ అమెరికన్ పెట్టుబడిదార్లతో జరిగిన ఈ ఒడంబడికలు తెలియజేస్తాయి.

"హిందూస్తాన్ టైమ్సు" (డిశెంబరు) ఇలా వ్రాసింది:

"నిర్మించనున్న నూనె శుద్ధి కర్మాగారపు పెట్టుబడిలోనూ, యాజమాన్యంలోనూ భాగస్వామ్యమును ప్రభుత్వం పరిత్యజించుట, సంస్థను నిర్వహించుటలో అధికార జోక్యమునకవకాశమిచ్చు నిబంధనలనుండి మినహాయించుట, ముడ్డినూనె, శుద్ధిచేయబడిన నూనె విషయములలోకూడ ఉదారమైనసుంకసౌలభ్యముల నిచ్చుట, అనునవి చాలా ఔదార్యమైన సౌకర్యాలే. ముఖ్యమైన పరిశ్రమలను ప్రభుత్వం ఒకకంట కనిపెడుతూనే వుండాలనే ప్రభుత్వపు విధానాన్ని మొదటి సౌకర్యాలు రెండూ నీళ్ళుగార్చుతాయి".

శుద్ధి కర్మాగారాలను నెలకొల్పడానికి జరిగిన బడిక మన దేశీయ ప్రయోజనాలకొరకే జరిగినదా? ఈ శుద్ధి కర్మాగారాలు మన నూనె సమస్యను పరి రిస్తాయా అని ప్రశ్నించుకుంటే తేలిపోతుంది. వీటిత సమస్య పరిష్కారంగాదు. ఈ శుద్ధి కేంద్రాలు నుండి పెట్రోలు, తదితర ఉపపదార్థాలను మాత్ర

చేయగలవే గాని నూనెను మాత్రం వుత్పత్తిచేయలేవు. మన దేశంలో నూనె కొల్లలుగావుండి శుద్ధి చేయడానికి శుద్ధి కేంద్రాలు లేకపోవుటగాదు మన సమస్య. అయితే యీ కేంద్రాలు మనకు లేని నూనెను వుత్పత్తిచేయడము లేదు. మన ముఖ్యమైన ఓడరేవులూ, సింహద్వారాలూ అగు బొంబాయి, కలకత్తా, మద్రాసులలోనే ఇవి ఎందుకు నెల కొల్పాలి ?

బ్రిటిష్, అమెరికన్ యుద్ధనౌకలువచ్చి విడిది చేసిపోవ డానికి కావలసిన సౌకర్యాలు ఏర్పాటుచేసుకోవడానికి యీ శుద్ధి కేంద్రాలు ఒక ముసుగు మాత్రమే. 30,000 టన్నుల శక్తిగలిగిన నూనె టాంకరు ఒకదానికి, ఒక యుద్ధనౌకకు కావలసినన్ని సౌకర్యాలు అవసరం. నూనెశుద్ధి కేంద్రాలు, వాటికోసం వచ్చే టాంకర్లమాటున యుద్ధనిర్మాణాలకు ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్యవాదులు సౌకర్యాలు సంపాదిస్తున్నారు.

ఈ శుద్ధి కర్మాగారాలకు కావలసిన మడ్డినూనె సాదీ అరేబియా, దక్షిణ అమెరికా, జావా వగైరా దేశాలనుండి ...స్తుంది. మడ్డినూనెను ఇంకెక్కడినుండియో తెచ్చుకోనవలసి ...ా యీ శుద్ధికర్మాగారాలను, ఆంగ్లో, అమెరికన్ ...జ్యవాదులు భారతదేశంలోనే ఏల నిర్మిస్తున్నారు ?

...చైనాలతో యుద్ధం సంభవించినట్లయితే, మధ్య ...చ్యాన్ని, ఆగ్నేయాశియా దేశాలను ఎర్రసైన్యం సుల ...గా జయించగలదు అని వారే చెపుతున్నారు.

...ందువల్ల, యుద్ధం వచ్చినట్లయితే నూనెశుద్ధి కర్మా ... "సురక్షిత ప్రదేశం"గా భారతదేశాన్ని ఎన్ను

కున్నారు. ఆ విధంగా భారతదేశం సామ్రాజ్యవాద యుద్ధ ప్రయత్నాలలోకి యీడ్చబడుతున్నది. మన నూనె సమస్యలకు పాక్షిక పరిష్కారమైతే, మనం శుద్ధికర్మాగారాలను తెచ్చుకోనరాదా? అని కొందరు ప్రశ్నించవచ్చు. అజ్ఞానం యీ ప్రశ్నకు మూలం. మన నూనె యిబ్బందులను పరిష్కరించుకోడానికి శుద్ధికర్మాగారాలు గాదు కావలసింది; బొగ్గునుండి నూనెను వుత్పత్తిచేయగల కృత్రిమ నూనె కర్మాగారాలు మనకు కావాలి. మనకు నూనె బావులు లేవు. బొగ్గు మాత్రమే వుంది. ఈ నూనె శుద్ధి కర్మాగారాలకు బదులుగా బ్రహ్మాండమైన కృత్రిమ నూనె కర్మాగారాన్ని స్థాపించవలసిందిగా "లోకోపకార పరాయణులు", "ఔదార్యనిష్ఠులు" అయిన అమెరికన్ పెట్టుబడిదార్లను భారత ప్రభుత్వం ఏల కోరలేదు? ప్రభుత్వం కావాలని అడగనూలేదు; అడిగితే అమెరికన్లు యిచ్చేదీలేదు. అట్టిది స్థాపించినట్లయితే విదేశీ నూనె సప్లయిలపై మనం ఆధారపడనక్కరలేదు. మన సమస్యల పరిష్కారానికి విదేశీ పెట్టుబడి గావాలని చెబుతుండే భారత ప్రభుత్వం, మన ముఖ్య సమస్యను సరైన పద్ధతి పరిష్కరించడానికిగాదు యీ పెట్టుబడిని ఆహ్వానించడ చేసినట్లయితే విదేశీ పెట్టుబడిదార్లకు దెబ్బతగులుతుం పెట్టుబడుల పెత్తనంనుండి మనం విముక్తిజెందుతాము.

ఆంగ్లో-అమెరికన్ పెట్టుబడిదార్లతో భారత త్వానికున్న సంబంధాల నిజస్వరూపాన్ని యీ న కర్మాగారాలు బట్టబయలుచేస్తున్నాయి.

ఈ ఒడంబడికలు కుదుర్చుకొనుటద్వారా ప్రభుత్వం ే చెప్పిన సూత్రాలనే వదిలివేసింది; మన నిధి నిక్షేపాలను దేశీ పెట్టుబడిదార్లకు తెగనమ్మివేసింది. ఇరాన్‌లోనూ, మధ్య ప్రాచ్యంలోనూ రద్దుచేయబడ సిద్ధంగానున్న ఆంగ్లో - అమెరికన్ నూనె గుత్తసంస్థలు, తమ దోపిడీని సాగించడానికి క్రొత్తప్రదేశాలకోసమై ఆతురత చెందుతున్నాయి. భారత ప్రభుత్వం వాటికి ఆశ్రయమిచ్చింది.

బ్రిటిష్ బడా పెట్టుబడిదార్ల పత్రిక "కాపిటల్" అమితానందంతో, నవంబరు 22 న యిలా వ్రాసింది :

"మధ్యప్రాచ్యంలో జరుగుతున్న జాతీయంచేసే కార్య క్రమానికి భారత దేశం "నైతిక సహాయం" యిస్తున్నప్పటికీ, తాను సానుభూతిచూపుతున్న వారివల్ల తన దేశీయ ప్రయోజ నాలకు భంగం రాకుండేందుకు సుదృఢమైన ఏర్పాట్లన్నీ చేసు కొనవలసిన అవుసరాన్ని ఢిల్లీ ప్రభుత్వం గుర్తించిందనడానికి యీ ఒడంబడికలు నిదర్శనం. తన స్నేహితులచేతనే దోపిడీ గలుగా నిందించబడుతున్నవారితో లాభసాటి ఒడంబడి చేసుకోవడం సాధ్యమైనదంటే కొన్ని రాజధానులకంటే రాజకీయవాస్తవికత పరిపక్వతనొందినదనిసూచిస్తుంది".

ఈ ఒడంబడికవల్ల "సప్లయరుగా యీ కంపెనీ (బర్మా ల్) యొక్క ప్రాముఖ్యత ఇనుమడిస్తుంది" అని "ఈస్టరన్ కానమిస్టు" (నవంబరు 23) అంగీకరించింది.

ఈ ఒడంబడికలు విస్తృతమైన ప్రాముఖ్యత గలవని బూర్జువా వర్గాలు వ్యాఖ్యానిస్తున్నాయి.

"హిందూస్తాన్ టైమ్సు యిలా వ్రాస్తున్నది"

"విదేశీ పెట్టుబడులపట్ల మన వైఖరిని గురించివున్న అ
ర్థాలూ, గందరగోళం యిక అంతరించాలి. భారతదేశ వా
వరణం విదేశీ పెట్టుబడులకు అత్యంతానుకూలంగా నున్నదని
గుర్తించాలి."

"కామర్సు పత్రిక (డిశెంబరు 8) యిలా వ్రాసింది."

"ఈ దేశంలోనికి విదేశీ పెట్టుబడి దిగుమతి గావడానికి
భారత విదేశాంగ విధానం అడ్డుపడదని అమెరికా రాయబారి
ఛెస్టర్ బౌల్సు అంతటివాడు చెప్పినదాని కిది ప్రత్యక్ష నిదర్శ
నం. దేశంలో శాంతి భద్రతలను కాపాడుటకూ, ప్రజా
స్వామ్య విధానాన్ని అనేక అడ్డంకులమధ్య సుస్థిరం చేయడానికి,
అనువైన మార్గాలను ఆలోచించడంలో భారతప్రభుత్వం
చూపిస్తున్న పరిపాలనా దక్షతపట్ల విదేశీ పెట్టుబడిదార్లకు
నమ్మకం కుదిరిందనడానికి యిదొక నిదర్శనం."

నెహ్రూ ప్రభుత్వం యీ ఒడంబడికలను ఆమో
డంతో, భారతదేశంలోని ప్రజాతంత్ర ఉద్యమాన్ని
వేయడానికీ, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాద దోపి
ధృతరాష్ట్ర కౌగిలిలోనే మనను అట్టిపెట్టడానికిగాను
హక్కులను నాశనంచేయడానికి పూనుకున్నది. అ
యుద్ధస్థావరాలను నెలకొల్పుటకు మన భూమాతను కా
కీయడానికి నాందిగానే యీ ఒడంబడికలు జరిగాయని
ప్రాచ్య దేశాల అనుభవమేచాటుతున్నది. మన దేశస
25 సంవత్సరాలు తాకట్టుపెట్టడానికి సమానమే

కాని యిట్టి ఒడంబడికల నూకలు చెల్లుతున్నాయి. ఇరాన్‌లోలాగే ఇక్కడకూడా పరిస్థితి మారితీరుతుంది. నెహ్రూ ప్రభుత్వం చేసిన అవమానకరమైన చేవ్రాలు గలిగిన ఒడంబడిక పత్రంమాత్రమే ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకుమిగిలేది.

---

## సవరణ

22 పేజీ 21వ లైనులో చట్టం (Law on rupee capital) అనేదానికి బదులు, చట్టం తేవడం (Law or rupee capital) అని చదుకోవాలి.

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B154 |
| పుస్తకం పేరు | భారతదేశంలోని విదేశ పెట్టుబడులు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | IV, 70, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jagamma |
| పేజీలు విడదీసినది | P. Jagamma |
| స్కాన్ చేసినది | Prateeksha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |